# ఛందో వ్యాకరణము

**FOR**

(Schools, Colleges & All
Competitive Examinations).

వ్యాకరణము-ఛందస్సు-అలంకారములు

లేఖకుఁడు

మేడిచెర్ల ఆంజనేయమూర్తి




ప్రకాశకులు :

విద్యార్థి పబ్లికేషన్స్

విద్యా విషయక ప్రచారకులు

H.O. : ఆర్యసమాజ్ మందిర్ ఎదురుగా, సుల్తాన్‌బజార్,
B.O. 2, లాల్‌బహద్దూర్ స్టేడియమ్ హైదరాబాదు-500001.
హైదరాబాదు-500001.

# అభిప్రాయము

డా॥ దివాకర్ల వెంకటావదాని
M. A. (Hons) Ph. D.,

పూర్వాంధ్ర శాఖాధ్యక్షులు.

ఉస్మానియా యూనివర్సిటి.

హైద్రాబాద్,

ది. 4-3-77.

విద్వద్వతంసులైన శ్రీ మేడిచెర్ల ఆంజనేయమూర్తిగారు రచించిన ఛందోలంకార విషయములతోఁగూడిన తెలుగు సంగ్రహవ్యాకరణమును బరిశీలించి యానందించితిని. శ్రీ ఆంజనేయమూర్తిగారు చిరకాలమునుండి బాలబాలికలకే కాక యువజనులకును సంస్కృతాంధ్రములను బోధించుచు నపారమైన యనుభవమును గడించి యున్నారు. జిజ్ఞాసువులైనవారికి సంస్కృతభాషను సులభముగా బోధించుటకు తగిన గ్రంథములను వాచకరూపమున వ్రాసి వారాభాషా ప్రచారమున కెన్నోవిధముల దోహదము కల్గించియున్నారు. ఇప్పటికిని నిస్స్వార్థముగా వారా ప్రచార ప్రబోధములను సాగించుచునే యున్నారు. వారి కృషి మిక్కిలి ప్రశంసనీయమును, ప్రోత్సాహోచితమునై యలరారుచున్నది.

ప్రకృతమైన ఈ తెలుగు సంగ్రహ వ్యాకరణము వారు ముఖ్యముగా విద్యార్థులకొరకు రచించినది. వ్యావహారికమను పేర గ్రామ్యము నిరాటంకముగా ప్రచారము పొందుచున్న ఈ రోజులలో వ్యాకరణ గ్రంథములు చదువువారే లేరు. నిజమునకు చదువవలసిన యవసరమును కానవచ్చుటలేదు. కాని సరియైన భాషాజ్ఞానము నలవఱచుకొన దలంచు వారికి వ్యాకరణము నెఱుంగవలసిన యావశ్యకమెంతైన నున్నది. ఇప్పటికింగూడ సున్నత పాఠశాలల తరగతుల పరీక్షలలో వ్యాకరణమునకు సంబంధించిన ప్రశ్నలిచ్చుచున్నారు. వారికి సరియైన సమాధానములు వ్రాయువారి కధిక గుణములు సంపాదించు నవకాశమున్నది. అందుచేతనే యనుభవజ్ఞులైన శ్రీ ఆంజనేయమూర్తిగారు శ్రమపడి ఈ గ్రంథమును వ్రాయుటయు విద్యార్థి పబ్లికేషన్సు వారు దానిని ప్రచురించుటయు జరిగినది.

ఈ గ్రంథమున నెనిమిది భాగములున్నవి. మొదటిది సంజ్ఞా ప్రకరణము. ఇది చాలా పెద్ద ప్రకరణము. శ్రీ ఆంజనేయమూర్తిగారు ఇందు వ్యాకరణమున నుపయోగింపఁబడు నూటయిరువది నాలుగు పారిభాషికపదములకు చక్కని వివరణము గావించియున్నారు. ఇందే కృత్, తద్ధిత ప్రత్యయములను అవిచేర్పఁగా నేర్పడు రూపములను గూడ నొసంగియున్నారు. అందుచేతనే యిందుకృత్ తద్ధిత ప్రకరణములు వేరుగా వ్రాయఁబడి యుండలేదు. రెండవ ప్రకరణమున ముఖ్యములైన తొమ్మిది సంస్కృత సంధులు వివరింపఁబడినవి. తెనుఁగున సంస్కృత సమాసములను వాడవలసిన యక్కఱ యెక్కువగా నుండుటచే స్వల్ప సంఖ్యాకములైన ఈ సామాన్య సంస్కృత సంధులనైన తెలిసికొన

వలసిన యవసరమున్నది. వానిని మూర్తిగారు సోదాహరణముగా వివరించియున్నారు.

మూడవ ప్రకరణము తెలుగు సంధులకు సంబంధించినది. ఇందు ముఖ్యములైన తెలుగు సంధులన్నియు విద్యార్థులకు గూడ సుబోధమగునట్లు విశదీకరింపఁబడినవి. నాలుగైదు ప్రకరణములు సమాసములకును, కారకములకును సంబంధించినవి. వీనిని గూడ విద్యార్థులు బాగుగా తెలిసికొనవలసిన యవసరమున్నది. కారకము తెలియనిచో భాష జాతీయముగా వాడుటకు తగిన యవకాశముండదు. ఆఱవ ప్రకరణము ఛందస్సునకు సంబంధించినది. ఇందు గురు లఘువులయు, గణయతి ప్రాసములయు స్వరూపమును సాధారణములైన వృత్త జాత్యుపజాతుల లక్షణములను స్పష్టముగా వివరింపఁబడినవి. ఏడవ ప్రకరణము శబ్దాలంకాంములకును ఎనిమిదవ ప్రకరణము అర్థాలంకారములకును సంబంధించియున్నవి. శ్రీ మూర్తిగారు విద్యార్థుల కత్యవసరములైన యలంకారములను మాత్రమే యిందు వివరించి యున్నారు. వారు చక్కని యుదాహరణములను గూడ నొసంగి యుండుటచే విద్యార్థులుపాధ్యాయుల సాహాయ్యము లేకుండఁగనే వానిని తెలిసికొనుట కవకాశమున్నది.

శ్రీ మూర్తి గారనుభవజ్ఞులగుటచే విద్యార్థుల యవగాహనశక్తి కనుగుణముగా సర్వవిషయములను వివరించి యున్నారు, వారి వివరణము సరళము, సర్వసుబోధమై యొప్పారు చున్నది. వారొసంగిన యుదాహరణములు లక్షణమున కనుగుణముగా నున్నవి. వారు సర్వత్ర సులభము, సలక్షణమునైనభాషవాడియున్నారు. విద్యార్థులీవ్యాకరణమును

శ్రద్ధగా చదివి నిర్దుష్టమైన భాషా జ్ఞానము నలవఱచుకొని. గ్రంథకర్త యొక్కయు, ప్రచురణ కర్తలయొక్కయు కృషిని సార్థక మొనరింతు రని యాశించుచున్నాను. భాషాజ్ఞానమునలవఱచుకొనఁగోరు పెద్దలుకూడ దీనిని చదివి తగిన లాభమును పొందవచ్చును.

5-3-77

హైదరాబాదు

—దివాకర్ల వేంకటావధాని.

# విషయ సూచిక

# తెలుఁగు సంగ్రహ వ్యాకరణము, ఛందస్సు, అలంకారములు

## 1 సంజ్ఞా ప్రకరణము

1. అక్షరము :- అక్షరమునకు వర్ణమనియు పేరు. 'అ' అనునది మొదలు 'ళ' అను దాని వఱకును గల వానినన్నిటిని అక్షరము లందురు. తెలుఁగుభాష సంస్కృత పదములతోఁగూడి యుండుటచే నట్టి తెలుఁగు భాషను తత్సను భాషయందురు. అట్టి తెలుఁగు భాషకు అక్షరములు ఏబది యయిదు.

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఎ ఏ ఐ ఒ ఓ ఔ అం అః క ఖ గ ఘ ఙ చ చే ఛ జ జే ఝ ఞ ట ఠ డ ఢ ణ త థ ద ధ న ప ఫ బ భ మ య ర ఱ ల వ శ ష స హ ళ

పై వానిలో అ మొదలు అః వఱకును గల 18 అక్షరములను అచ్చులందురు. తత్సమ పదములు కలియని (సంస్కృత పదములు కలియని) తెలుఁగు భాషను అచ్చతెలుఁగు అందురు. దానికి అక్షరములు ముప్పదియారు మాత్రమే.

అ ఆ ఇ ఈ ఉ ఊ ఎ ఏ ఐ ఒ ఓ ఔ అం అః

క గ చ చ̄ జ జే ట డ ణ త ద న ప బ మ య ర ల వ స హ ళ.

2. పదము :- పైన చెప్పబడిన కొన్ని యక్షరములు కలిసి యొక పదము ఏర్పడుచున్నది. అట్టి పదములో మూలభాగము కొంత యుండును. ఆ మూలభాగమునకు సందర్భమును బట్టి వేఱు వేఱు ప్రత్యయములు చేరుచుండును. ఆమూలభాగమును ప్రత్యయమును కలిసి పదమగును. ఈ పదములు అనేక విధములుగా నుండును.

3. ప్రత్యయము :- ప్రత్యయమునకు వర్ణకమనియు పేరు (డుము వులు మొదలగునవి)

4. వాక్యము :- పైన చెప్పిన పదములు కొన్ని చేరి యొక వాక్యమగును. ఒక సంపూర్ణాభిప్రాయమును దెలుపు దానిని వాక్యమందురు. వాక్యము నందలి పదములన్నియు అర్థము కలిగియుండును. సంపూర్ణాభిప్రాయము నిచ్చు వాక్యములో కర్త కర్మ క్రియ యనునవి యుండును. ఒక్కొక్కప్పుడు ఒకే పదము గూడ వాక్యము కావచ్చును. అచట తక్కిన వాక్యాంశములన్నియు తెచ్చి పెట్టికొనవలసి యుండును.

ఉదా :- రాముఁడు కుక్కను కొట్టెను (కర్త కర్మ క్రియ గల వాక్యము)

ఉదా :- తలుపు తలుపు (ఓ లోపలివ్యక్తీ ! తలుపు తీయుము అని భావము)

5. కర్త :- వాక్యమునందలి మొదటి ముఖ్యాంశము కర్తను బోధించు పదము. ఒక చోట ఒకపని జరిగినచో అది జరుగుటకు ఆధారమయిన వాడు కర్తయగు చున్నాఁడు గాన అతనిని బోధించు పదము ముఖ్యము (రాముఁడు వింటిని ఎక్కు పెట్టెను) పై వాక్యములో ఎక్కు పెట్టుట అను పనికి రాముఁడు ఆధారము. కావున అతనిని బోధించు పదము కర్తృ వాచక మగుచున్నది. రాముఁడు కర్త యగుచున్నాడు.

6. కర్మ :- ఒక చోట ఒక పనిజరిగినచో దాని ఫలితమును అనుభవించునది కర్మ. దానిని బోధించు పదము కర్మ వాచకము (గోపాలుఁడు అన్నము తినెను) ఈ వాక్యమున తినుట అనుపని యొక్క ఫల మనుభవించినది అన్నము. కావున అన్నము అనుపదము కర్త వాచకము.

7. క్రియ :- ఒక చోట ఏదైన పని జరిగినచో దానిని క్రియ యందురు. దానిని బోధించు పదమును క్రియా వాచక మందురు. (వండు, తిను ॥మొ॥)

క్రియలలోని భేదము :-

8. సకర్మకక్రియలు :- ఏ క్రియకు కర్మ తప్పకయుండునో దానిని సకర్మకక్రియ యందురు.

ఉదా :- రాముఁడు కుక్కను కొట్టెను. ఇందు 'కొట్టెను' అను పదమును వినినతోడనే ఎవఁడు ఎవనిని కొట్టెను ? అని కర్తయు కర్మయు ప్రశ్నింపఁబడు చున్నారు. ఇట్లు కర్మ గూడ ఏ క్రియ ద్వారా ప్రశ్నింపఁబడునో దానిని సకర్మక క్రియయందురు.

9. అకర్మక క్రియ :- ఏక్రియకు కర్మతో అవసరము ఉండదో దానిని అకర్మక క్రియయందురు.

ఉదా :- కుక్క మొఱిగెను. ఇచట మొఱిగినదియు, మొఱుగుట యొక్క ఫలము ననుభవించినదియు కుక్కయే కావున ఇట్టి క్రియలను అకర్మక క్రియలందురు.

10. సమాపకక్రియ :- ఒక వాక్యములోని భావమును పూర్తి చేయు క్రియను సమాపక క్రియయందురు.

ఉదా :- బాటసారి చెట్టు క్రింద నిద్రించెను. ఈ వాక్యములో 'నిద్రించెను. అను క్రియాపదము వాక్యము యొక్క భావమును పూర్తి చేయుచున్నది. కావున నిది సమాపక్రియ.

సమాపకక్రియలలోని భేదములు :-

11. వర్తమాన కాలము :- ఒకపని జరుగుచున్నచో ఆకాలమును వర్తమానకాల మంచురు. ఆ పదమును వర్తమానార్థకక్రియ యందురు.

ఉదా :- వండుచున్నాఁడు, తినుచున్నాఁడు, పోవుచున్నాఁడు ॥మొ॥ ఈ యుదాహరణములలో పనిప్రారంభమయి ముగియకముందున్న స్థితి స్పష్ట మగుచున్నది. ఇట్టి కాలమునే వర్తమానకాల మంచురు.

12. భూతకాలము :- ఒక పని పూర్తయయినచో అది వర్తమాన కాలమును త్రోసివేసి జరిగిపోయిన కాలమున ప్రవేశించిన దన్నమాట. అట్లు జరిగిపోయిన పని యొక్క స్థితిని తెలుపు కాలమును భూతకాల మందురు.

ఉదా :- వండెను, తినెను, పోయెను మొ॥ ఈయుదాహరణములలో పని ముగిసినది. ఇట్టి కాలమునే భూతకాలమందురు.

13. భవిష్యత్కాలము:- ఇంకను ప్రారంభముకాక, మున్ముందు జరుగఁబోవు క్రియ యొక్క స్థితిని చెప్పు కాలమును భవిష్యత్కాల మందురు.

ఉదా :- వండఁగలఁడు, తినఁగలఁడు ॥మొ॥ ఈ యుదాహరణ ములలో పని ప్రారంభమే కాలేదు. మున్ముందెప్పుడో జరుగనున్న దన్న మాట. ఇట్టికాలమునే భవిష్యత్కాలమంధురు.

14. తద్ధర్మకాలము :— తద్ధర్మమనఁగా ఒక వ్యక్తి యొక్కఁగాని, జీవియొక్కఁగాని, వస్తువుయొక్కఁగాని సర్వ కాలమును విడువకయుండు ధర్మమని భావము. ఆధర్మము క్రియాపదము ద్వారా చెప్పఁబడునుగాన ఆ క్రియపదములను తద్ధర్మకాలిక క్రియలందురు. ఈ తద్ధర్మకాలము భూత, భవిష్య ద్వర్తమాన కాలములకు మూఁడింటికి సంబంధించి యుండును.

ఉదా:- వాఁడు వచ్చును (వచ్చుస్వభావము గాలవాఁడని యర్థము. పూర్వము వచ్చినాఁడు, ఇప్పుడు వచ్చుచున్నాడు, ముందును రాఁగలఁడు అని భావము.)

15. వ్యతిరేకార్థకము :- అనుకూలముగా గాక ప్రతికూలముగా జరుగు క్రియను వ్యతిరేకార్థక మందురు.

ఉదా :- చేయును X చేయఁడు. కొట్టును X కొట్టడు. ఈ యుదాహరణములలో అనుకూలములును, ప్రతికూలములును చూపఁబడినవి. క్రియ జరుగనట్లు చెప్పుస్థితియే ఈ కాలమునందలి విశేషము.

16. అసమాపకక్రియ :— ఒక వాక్యములోని భావము ఇంకను ఉన్నదని సూచించు నట్లు ప్రయోగింపఁబడిన క్రియను అసమాపక క్రియ యందురు.

ఉదా :- 'నేను ఉదయముననే, నిద్రలేచి ముఖము కడుగుకొని, స్నానము చేసి' పై వాక్యములో లేచి, కడుగుకొని, స్నానముచేసి అనునవి వాక్యములో భావము పూర్తి చేయక ఇంకను భావమున్నదని సూచించుచున్నవి. కావున ఇట్టి వానిని అసమాపకక్రియ లందురు.

అసమాపక క్రియలలోని భేదములు ;-

17. క్త్వార్థకము :- జరిగి పోయిన పనిని వాక్యమును పూర్తి చేయక బోధించు క్రియాపదమును క్త్వార్థక మందురు. దీనినే భూత కాలిక అసమాపకక్రియ యనియు నందురు,

ఉదా :- వాఁడు అన్నమునుతిని, బడికివెళ్ళి, పాఠములు చదివి ——మొ॥ పై వాక్యములోతిని, వెళ్ళి, చదివి అనుధాతువుల చివర చేరిన 'ఇ'అను ప్రత్యయమును క్త్వార్థకఇకార మందురు. ఆ పదములను క్త్వార్థ కము లందురు.

18. వ్యతిరేకక్త్వార్థకము :- ఈ క్త్వార్థక మయిన అసమాపక క్రియయే వ్యతిరేకార్థమున ఉపయోగింపఁబడినచో దానిని వ్యతిరేకక్త్వార్థక క్రియ యందురు.

ఉ :- చదివి × చదువక. తిని × తినక ఈ యుదాహరణములలో చదువు, తిను అనుధాతువులకు వ్యతిరేకక్త్వార్థమున 'అక' అను నది వచ్చి చేరినది.

19. శత్రర్థకము :- 'చున్' అను ప్రత్యయము ధాతువునకు చివర చేరినప్పుడు ఆ క్రియాపదము శత్రర్థకమగును.

ఉ :- తినుచున్, నిద్రించుచున్ ॥మొ॥

20. తుమున్నర్థకము :- 'అన్' అను ప్రత్యయము ధాతువునకు చివరఁ జేరినచో ఆ క్రియా పదము తుమున్నర్థకమగును.

ఉ :- చేయన్ ఏగెను (ఈ యుదాహరణమున చేయు అనుధాతువు చివర ఉకారముపోయి దానికి బదులు 'అన్' అనునది వచ్చినది.

21. చేదర్థకము :- 'ఇనన్' అనునది ధాతువునకు చివరఁ జేరినచో నది చేదర్థకక్రియ యగును.

ఉదా :- నీవువచ్చినన్ మేలగును. ఈ యుదాహరణమున 'వచ్చు' అనుధాతువునకు చివర 'ఇనన్' అనునది చేరినది.

22. ఆనంతర్యార్థకము :- 'డున్' అను ప్రత్యయము ధాతువునకు చివర చేరినచో అది ఆనంతర్యార్థక క్రియాపదమగును.

ఉదా :- 'జాబిలి తోతెంచున్ కువలయంబులు వికసిల్లె' ఈ యుదాహరణమున 'తోతెంచు' అనుధాతువుచివర 'డున్' అను ప్రత్యయము చేరినది.

23. భావార్థకము :- 'ట' అను ప్రత్యయము ధాతువునకు చివర జేరి ఆధాతువుయొక్క అర్థమునే తెలుపును. దీనిని భావార్థక క్రియాపద మందురు.

ఉదా :- వండుట. తినుట మొ॥ ఈ యుదాహరణములంతు భావార్థమున 'ట' అను ప్రత్యయము ధాతువుల చివర చేర్చబడినది.

24. వ్యతిరేక భావార్థకము :- 'అమి' అను ప్రత్యయము ధాతువునకు చివరఁ జేరినచో అదివ్యతిరేక భావార్థక క్రియయగును.

ఉదా :- వండు × వండమి. తిను × తినమి (ఈ యుదాహరణములలో ధాతువుల చివర 'అమి' అను ప్రత్యయముచేరినది (వండక పోవుట యని యర్థము) పైన చెప్పిన కర్మక్రియలతోఁగూడిన కొన్ని వాక్యములు కలిసి భాషయగు చున్నది.

25. భాష :- ఇతరుల యభిప్రాయములను మనము తెలుసు కొనుటకును, మన యభిప్రాయములను ఇతరులకు తెలియఁజెప్పుటకును ఉపయోగింపఁబడునది భాషయనఁబడును. "భాష్యతే ఇతి భాషా" అనగాఁ

భాషింపఁబడునది భాషయని యర్థము. అట్టిభాషలోని స్థూలమయిన భాగములు మూఁడు 1. అక్షరములు, 2. పదములు, 3. వాక్యములు.

26. అచ్చులు :- అక్షరములు అచ్చులనియు, హల్లులనియు, రెండు విధములుగా విభజింపఁబడినవి. వీనికి అచ్చులనియు హల్లులనియు పేర్లు వచ్చుటకు సంస్కృత వ్యాకరణ ప్రారంభము నందలి మాహేశ్వర సూత్రములు కారణములు (ఇవి అ మొదలు అః వరకు) అచ్చులకు ప్రాణములనియు, స్వరములనియు పేర్లు గలవు.

27. హల్లులు :- హల్లులకు ప్రాణులనియు, వ్యంజనములనియు పేర్లు గలవు (ఇవి క మొదలు ళ వరకు) ఇవి 37.

28. ఉభయాక్షరములు :- సున్నను, విసర్గమును ఉభయాక్షరములందురు. ఇవి అచ్చు ధర్మమును, హల్లుధర్మమును కలిగియుండుటచే ఉభయాక్షరములనిరి.

29. హ్రస్వములు :- అచ్చులు దీర్ఘములు కాకున్నచో (పొట్టివైనచో) హ్రస్వములందురు.

ఉదా :- అ, ఇ, ఉ, క, చ, ట, మొ॥

30. దీర్ఘములు :- అచ్చులు దీర్ఘములైనచో (పొడుగువైనచో) దీర్ఘము లందురు.

ఉదా :- ఆ, ఈ, ఊ, కా, చా, టా మొ॥

31. సంస్కృతములో నుండి తెలుఁగులో జేరిన యక్షరములు 19 ఋ ౠ ఌ ౡ :

ఖ ఛ ఠ థ ఫ ఘ ఝ ఢ ధ భ ఙ ఞ శ ష

32. కేవలము తెలుఁగులో మాత్రమే యుండు అక్షరములు. 6.

ఎ ఒ ఁ చ జ ఱ ళ

33. వక్రములు :- వంకరగా నుండుట గాన వీనికి వక్రములని పేరు వచ్చినది.

ఎ ఏ ఒ ఓ

34. వక్రతమములు :- మిక్కిలి వంకరగా నుండును గాన వీనికి వక్రతమములని పేరు వచ్చినది.

ఐ, ఔ.

35. పరుషములు :- కఠినముగాఁబలుకఁబడును గాన వీనికి పరుషములని పేరు వచ్చినది.

క చ ట త ప

36. సరళములు :- పలుకుటకు సరళముగా నుండును గాన వీనికి సరళములని పేరు వచ్చినది.

గ జ బ ద డ

37. స్థిరములు :- మార్పుచెందక స్థిరముగా నుండునవి గాన వీనికి స్థిరములని పేరు వచ్చినది.

ఖ ఘ జ ఛ ఝ ఞ ఠ ఢ ణ థ ధ న ఫ భ మ య ర ల వ శ ష స హ ళ

38. అంత స్థములు :- నోటి లోపలిభాగమునందలి ప్రయత్న మెక్కువ కలవి యగుటచే వీనిని అంతస్థము లనిరి.

య ర ల వ

39. ఊష్మములు :- ఉచ్చారణ సమయమున నోటినుండి గాలి వెడలును గాన వీనికి ఊష్మములని పేరు వచ్చినది.

శ ష స హ

40. స్పర్శములు :- అవయవముల స్పర్శ వీనికెక్కువ యుండు నుగాన వీనికి స్పర్శములను పేరు వచ్చినది. ఇవి అయిదు వర్గములుగా నుండును.

1. కవర్గము :- కఖగఘఙ
2. చవర్గము :- చఛజఝఞ
3. టవర్గము :- టఠడఢ
4. తవర్గము :- తథదధన
5. పవర్గము :- పఫబభమ

41. కంఠ్యములు :- కంఠము నుండి పుట్టునుగాన వీనికి కంఠ్యములని పేరు వచ్చినది.

అఆకఖగఘఙహ ఃక

(కకారమునకు ముందున్న విసర్గమును విసర్జనీయ మందురు.)

42. తాలవ్యములు:- దవడలనుండి పుట్టును గాన వీనికి తాలవ్యములని పేరు వచ్చినది, తాలువులనఁగా దవడలు.

ఇఈచఛజఝఞయశ

43. మూర్ధన్యములు ;- నోటిలోని పై భాగమునుండి పుట్టును గాన వీనికి మూర్ధన్యములను పేరు వచ్చినది.

ఋౠటఠడఢణరష

44. దంత్యములు :- దంతముల నుండి పుట్టును గాన వీనికి దంత్యములని పేరు వచ్చినది.

ౡౢతథదధనలసచ జ

45. ఓష్ఠ్యము :- పెదవుల నుండి పుట్టునను గాన వీనికి ఓష్ఠ్యము లని పేరు వచ్చినది.

ఉఊపఫమభమ ꣳప (పకారమునకు ముందున్న విసర్గమును ఉపధ్మానీయ మందురు)

46. అను నాసికము :- ముక్కుతోఁగూడ పలుకఁడును గాన వీనికి అను నాసికములని పేరు వచ్చినది.

ఙఞణనమ

47. తాలవ్యములయిన :-

సూ :- ఇ ఈ ఎ ఏలం గూడిన చజలు తాలవ్యంబులు. పై అక్షర ములతోఁగూడిన చకార జకారములను తాలవ్యములందురు.

ఉదా :- చిలుక, చీమ, చెలి, చేమ, జిల, జీడి. జెట్టి, జేజె

48. దంత్యములయిన చజలు :-

సూ :- అఆ ఉఊ ఒఓఔలం గూడిన చజలు దంత్యంబులు. పై అక్షరములతోఁగూడిన చకారచకారమును దంత్యములందురు.

ఉదా :- చలి, చాప, చుక్క, చూపు, చొక్కు, చోటు, చౌక జముఁడు, జాతర, జున్ను, జూలు, జొన్న, జోలి, జౌకు.

49. వర్గయుక్కులు :- కచటతప అను వర్గములోని రెండవ నాల్గవ అక్షరములు వర్గయుక్క లనఁబడును. వీనికి తెలుఁగులో ఒత్త క్షరములని వాడుదురు.

ఖఘఛఝఠఢథధఫభ

50. సాధురేఫము :- దీనిని రకారమని వాడరాదు. 'రాధిఫః' అను సూత్రము ననుసరించి రేఫము అనియే వాడవలయును. సంస్కృత పద ములందు శకట రేఫము ఉండదు. సాధురేఫమే యుండును.

'ర'

51. శకటరేఫము:- ఇది శకటము యొక్క ఆకారముగా నుండును గాన దీనికి శకటరేఫ మని పేరు వచ్చినది.

'ఱ'

52. ద్రుతము, 53 ద్రుత ప్రకృతికము, 54. కళ.

సూ:- నకారంబు ద్రుతంబు, (సామాన్యముగా నకారము ద్రుత మని చెప్పినను ఇదు ఁ, ం, న్, ను అని నాలుగు ఆకారములతోఁ గని పించును. ద్రుతమనఁగా కఱిగిపోవునది యని యర్థము.

43. ద్రుత ప్రకృతికములు:- సూ:- ద్రుతాంతములయిన పద ములు ద్రుత ప్రకృతికములు.

అనఁగా ద్రుతము చివరనున్న పదము లన్నియు ద్రుతప్రకృతి కము లగును.

1. విభక్తి ప్రత్యయము :- నిన్, నున్, లన్, చేతన్, చేన్, తోడన్' తోన్, కొఱకున్, వలనన్, కంటెన్, కిన్, కున్, లోన్, లోప లన్, అందున్, నన్, అనునవి యన్నియు ద్రుతప్రకృతికములు.

2. ఉత్తమ పురుషైక వచనములు:- వత్తున్, వచ్చెదన్,

3, భూత తద్ధర్మార్థక ప్రథమ పురుషైక వచనములు.

అయ్యెడిన్, అయ్యెడున్, కావుతన్, (ఆశీరాద్యర్థకములు)

వచ్చుచున్, (శత్రర్థకము)

వండన్, (తుమున్నర్థకము)

చేయుడున్, (అనంతర్యార్థకము)

కొట్టినన్, తిట్టినన్ (చేదర్థకము)

తాను, నేను (అను పదములు)

పైవన్నియు ద్రుతప్రకృతికములు.

మైన్, మెయిన్, పొంటెన్, (ఇవియు ద్రత ప్రకృతికములే యగును.

ఇందున్, ఎందున్ (అనునవి గూడ 'అందున్' అను విభక్తి ప్రత్యయపు పోలికను బట్టి ద్రుతప్రకృతిములే యగుచున్నవి.

ఊరనున్నాడు. (అనుదాని యందలి 'ఊరన్' అను పదములోని సప్తమ్యర్థకమయిన 'అన్' అనునదియు ద్రుతప్రకృతికమే యగును.

'ను' చివరనున్న క్రియాపదము లన్నియు ద్రుత ప్రకృతికములే.

54. కళలు:- సూ :- ద్రుత ప్రకృతులు కాని శబ్దమును కళ లనంబడు.

పైన చెప్పిన ద్రుత ప్రకృతికములు కాని పదము లన్నియు కళ లని చెప్పఁబడును.

ఉదా :- డు, ము, వు, కై పట్టి, యొక్క (విభక్తి ప్రత్యయములు)

వచ్చిరి, వచ్చితివి, వచ్చితిరి, (క్రియాపదములు.)

రాఁడు, రావు, రాదు, రాము (వ్యతిరేక క్రియా పదములు)

వండి, తిని, వచ్చి, చేసి (క్త్వార్థక క్రియాపదములు)

వండక, తినక, రాక, చేయక (వ్యతిరేక క్త్వార్థక క్రియా పదములు)

ఊరక, మిన్నక, భళి, ఆక్కట (అవ్యయ పదములు)

నుండి, ఉండి, (పంచమ్యర్థకములు)

చేయుము, చేయుఁడు (ప్రార్థనాద్యర్థకము)

వచ్చుట. చేయుట (భావార్థకములు)

రామి, చేయమి (వ్యతిరేక భావార్థకములు)

వచ్చిన, పోయిన (క్రియాజన్య విశేషణములు)

చేయు, చేసెడి (తద్ధర్మ విశేషణములు)

మఱి, ఏల, కాని, కాఁబట్టి (మున్నగు అవ్యయములు)

పైవన్నియు కళలే యగును.

55. సంశ్లేషము :- సంశ్లేషం బనఁగా మీఁది హల్లుతోఁ గూడి కొనుట.

ఉదా :- పూచెన్ + గలువలు = పూచె న్గలువలు

56. ద్విత్వము :- ఒకే హల్లుయొక్క రెండు రూపములు ఒక దానితో నొకటి గూడికొన్నచో దానిని ద్విత్వాక్షర మందురు.

ఉదా :- అక్క్రరము.

57. సంధి :- సూ :- పూర్వపర స్వరంబులకు పరస్వరం బేకా దేశంబగుట సంధి యనంబడు.

ఉదా :- రాముఁడు + అతఁడు=రాముఁడతఁడు.

58. (అ) ఆగమము :- 59. ఆదేశము, 60. లోపము.

సూ :- ఒక యక్షరమును గాని, అక్షర సముదాయమును గాని త్రోసివేయక వాని మధ్యలో వేఱొక యక్షరముగాని యక్షర సముదాయము గాని మిత్రునివలె వచ్చి చేరినచో దానినే ఆగమమందురు.

ఉదా :- హరి + అతఁ డు= హరి + య్ + అతఁడు = హరి యతఁడు.

58. యడాగమము:- సూ :- సంధిలేని చోట స్వరంబు కంటెం బరంబయిన యడాగమం బగు.

సూత్రములోని 'యట్' అనుదానితో యకారము మాత్రమే మిగులును. అనఁగా 'య్' అని మాత్రమే మిగులు నన్నమట. ఇక టకార మెపదుకనఁగా దేనికి యడాగమము చెప్పఁబడినదో దానికి అది ముందు వచ్చునని తెలుపుటకు మాత్రమే. ఈ విషయమును చెప్పి అది వెడలి పోవును. పై సూత్రములో పరంబైన స్వరంబునకు అని యున్నది. దానికి యడాగమము వచ్చును. అనఁదా 'య్' అనునది పరస్వరమునకు ముందు వచ్చునని చెప్పి వెడలిపోవు నన్నమాట.

దూత + ఇతఁడు=దూత + య్ + ఇతఁడు=దూత యితఁడు.

59. ఆదేశము :- సూ :- ఒక అక్షరమును గాని, అక్షర సముధాయమును గాని త్రోసివేసి వాని స్థానముల వేఱొక యక్షరము గాని,

అక్షర సముదాయము గాని శత్రువువలె వచ్చి చేరినచో దానిని ఆదేశ మందురు.

ఉదా :- అతి + ఆదరము = అత్య్ ఆదరము = అత్యాదరము.

(పై యుదాహరణములో 'అతి' అను పదములో చివరనున్న ఇకారమును త్రోసివేసి దాని స్థానమున 'య్' అనునది చేరినది)

60. లోపము :- సూ :- ఒక అక్షరము గాని, అక్షర సముదాయము గాని కనిపింపకుండ పోయినచో దానిని లోపము అందురు.

ఉదా :- వచ్చెను, వచ్చెన్, వచ్చె (ఈ యుదాహరణమ ద్రుత ప్రకృతిక పదము. దీనిలోని చివరి 'ను' అను దానిలోని ఉకారమునకు లోపము రాఁగా రెండవరూప మైనది. నకారపు పొల్లు గూడ లోపింపఁగా మూఁడవరూప మైనది.)

61. నిత్యము; 62. వైకల్పికము, 63. బహుళము.

61. నిత్యము:- సూ :- సూత్రములో చెప్పఁబడిన విషయము అన్ని యుదాహరణముల యందును తప్పక ప్రసరించినచో దానిని నిత్యము అందురు.

ఉదా :- రాముఁడు + అతఁడు=రాముఁడతఁడు (ఈ యుదాహరణమునందు ఉకారమునకు అచ్చు ప్రక్క నుండుటచే సంధి తప్పక రావలసియున్నది. కావున సంధి వచ్చినది.

62. వైకల్పికము :- సూ:- సూత్రములో చెప్పఁబడిన విషయము ఒకే యుదాహరణములో ఒక పర్యాయము ప్రసరించుటయు, ఇంకొక పర్యాయము ప్రసరింపక పోవుటయు జరిగినచో దానిని వైకల్పికము అందురు,

ఉ :- మేన + అల్లుఁడు=మేనల్లుఁడు. మేనయల్లుఁడు (ఈ యుదాహరణములో ఒకమాఱు సంధి వచ్చుటయు, ఒకమాఱు సంధిరాకపోవుటయు జరిగినది.

వైకల్పికమును, విభాషయనియు, వికల్పమనియు వ్యవహరింతురు.

63. బహుళము :- సూ :- సూత్రములో చెప్పబడిన విషయము కొన్ని యుదాహణములలో తప్పక ప్రసరించుటయు, కొన్ని యుదాహరణములలో వికల్పముగా ప్రసరించుటయు కొన్ని యుదాహరణములలో అసలే ప్రసరింపక పోవుటయు, మఱికొన్ని యుదాహరణములలో చెప్పిన దానికంటె ఇంకొక తీరుగా వచ్చుటయు జరిగినచో దానిని బహుళమందురు.

ఉదా :- చింత + ఆకు=చింతాకు (ఇచట సూత్ర విషయము తప్పక ప్రసరించినది) మేన + అల్లుఁడు=మేనల్లుఁడు మేనయల్లుఁడు. (ఇందు సూత్రవిషయమైన సంధి వికల్పకముగా వచ్చినది) దూత + ఇతఁడు=దూతయితఁడు (ఇందు సూత్ర విషయము ప్రసరింపనేలేదు) క్రిందు + నీడ=క్రీనీఁడ (ఇందు సూత్రవిషయమునకు భిన్నముగా మార్పు జరిగినది)

64. త్రికము:- తెలుఁగు వ్యాకరణమున అ, ఈ, ఏ లు అను మూఁడక్షరములకును గలిపి త్రికము అనిపేరు పెట్టినారు.

ఉ :- ఆ కాలము, ఈ కాలము, ఏ కాలము.

65. ఆమ్రేడితము :- సూ :- ఒకే పదము ఆశ్చర్యము మున్నగునని ప్రకటించునప్పుడు వెంట వెంటనే రెండు పర్యాయములు పలుకుట జరిగినచో ఆ రెండు పదములలోని రెండవపదమును ఆమ్రేడితమందురు.

ఔరా + ఔరా = ఔరౌరా (ఈ యుదాహరణమున రెండవ పది మయిన 'ఔరా' అనునది అమ్రేడిత మగుచున్నది.

66. శబ్ద పల్లవము:– సూ:–ధాత్వాదులకు ధాతువులను ప్రయుక్తంబులై విలక్షణార్థాభిధాయకంబులగు నీయవి శబ్దపల్లవంబులు నాఁబడు.

ఉదా:– ఏగు + తెంచు = ఏగుదెంచు (ఈ యుదాహరణమున 'ఏగు' అను ధాతువుతోఁబాటు 'తెంచు' అనుధాతువు గూడ వెంటనే ప్రయోగింపఁబడినది. ఇందువలన ఈ రెండు ధాతువుల యర్థములును పోయి వానికి సంబంధములేని ఘటియొక యర్థము నిచ్చుచున్నది. ఏగుదెంచు అనఁగా, వచ్చు అనియర్థము. ఏగుఅనఁగా వెళ్ళు అని యర్థము. తెంచు అనఁగా తెంచివేయుట యని యర్థము

పై సూత్రములోని అనుప్రయుక్తము అనుదానికి ఒక పదము తరువాత నింకొక పదము దానితో సంబంధమును పొంది ప్రయోగింపఁబడుట యని యర్థము.

67. ఉపధ–ఉపధ యనఁగా పదముయొక్క చివరి యక్షరమునకు వెనుకనున్న యక్షరము.

ఉదా:– ములికి (ఈ పదమునందు చివరి యక్షరము ఇకారాము. దాని వెనుకనున్న యక్షరము కకారము. అ కకారమునే ఉపధయందురు.

68:– తత్సమము. సంస్కృత పదములతో సమానము లయిన పదములను తత్సమము లందురు.

ఉదా:– రాముఁడు, వనము. ధేనువు, లత మొ॥

69. తద్భవము:– సంస్కృత పదములు వాడుకవలన మార్పు చెందినచో వానిని తద్భవము లందురు.

శృఙ్గారము—సింగారము　　　బ్రధ్న—ప్రొద్దు

రథము—అరదము　　　బుద్ధి—బుద్ది

శుచి—చిచ్చు　　　ఆశ్చర్యము—అచ్చెరువు మొ॥

వీనినే ప్రకృతి వికృతులని వ్యవహరింతురు. ప్రకృతు లనఁగా సంస్కృత పదములనియు, వికృతు లనఁగా మార్పు చెందిన రూపము లనియు గ్రహింపనగును.

70. దేశ్యము:— సూ:— త్రిలింగ దేశ వ్యవహార సిద్ధంబగు భాష దేశ్యంబు దాక్షారామము, కాళహస్తి, శ్రీశైలము అను మూఁడు పుణ్యక్షేత్రములకును మధ్యనున్న దేశమునకు త్రిలిఙ్గ దేశమని పేరు. ఈ త్రిలింగ దేశమున వ్యవహారము వలనఁ బుట్టిన భాషనే తెలుఁగు భాష యందురు.

ఉదా:— ఊరు, మేడ, పల్లె, గోడ మొ॥

71. అన్యదేశ్యము:— మన తెలుఁగు దేశమునకు ఇరుగు పొరుగునఁ గల దేశములు ద్రవిడము, కన్నడము మొదలగునవి. అచటి భాషలలో మనకు సంబంధము ఉండక తప్పదు ఇంకను మన దేశము నాక్రమించి పరిపాలనము సాగించిన మొహమ్మదీయులు, ఆంగ్లేయులు తమ తమ భాషలలో రాజకీయములను నడిపి యుండుటచే వారి భాషా పదములు గూన మన తెలుఁగులో కొన్ని చేరినవి వాని నన్నిటిని కలిపి అన్యదేశ్యములని వ్యవహరించుచున్నాము.

ఉదా:— నెయ్య, తమాషా, దరఖాస్తు, రోడ్డు, రైలు, మొ॥

72. గ్రామ్యము:– వ్యాకరణమునకు విరుద్ధములయిన పదము లను గ్రామ్యము లందురు. మనము మాటాడునపు డుపయోగింపఁబడు పదములన్నియు గ్రామ్యములే యగుచున్నవి.

ఉదా:– వస్తాడు, తెస్తాడు, వచ్చాఁడు, అచ్చిడు మొ॥

73. అనింద్యగ్రామ్యము:– పెద్దలు వ్యవహరించిన వానిలో నేవేని వ్యాకరణమునకు విరుద్ధములుగాఁ కనిపించినను వానిని గ్రహింప నగును.

ఉదా:– కరకంఠుఁడు, ప్రాణగొడ్డము, జీవగఱ్ఱ మొ॥

74. స్త్రీ సమము:– ప్రథమా విభక్తి ప్రత్యయములు చేరని తెలుఁగు పదములను స్త్రీ సమములని వ్యవహరింతురు. నిజమునకివి స్త్రీ వాచకములు గావు. కాని 'సీత' మొదలయిన పదములకు వలె వీనికిఁ గూడ విభక్తి ప్రత్యయములు కనిపింపవు. కాపున వీనిని స్త్రీ సమము లనిరి.

ఉదా:– ఊరు, మేడ, ఇల్లు, బల్లి మొ॥

75. క్లీబసమము:– (నపుంసక లింగ శబ్దములతో సమానములు) పురుషులను, స్త్రీలను బోధింపనివియు, నపుంసక లింగ శబ్దములకు వలె చివర ప్రథమా విభక్తి ప్రత్యయమగున 'ము' అను ప్రత్యయము చేర్పఁ బడునవియునగు తెలుఁగు పదములన్నియు క్లీబసమము లగును.

ఉదా:– అల్లము. బెల్లము మొ॥

76. సంస్కృత సంధులు:– సూ:– బల్లిదాదులు సంస్కృత తుల్యంబులు (బల్లిద మొదలయిన శబ్దములు సంస్కృత పదములతో

సమానములగును ఇవి అచ్చ తెలుఁగు పదములు గానఁ వీనికి సంస్కృత పదములకు వలె ప్రత్యయములు చేరును గావున నిట్లు చెప్పినారు.

వీనికి పులింగములైనచో ఉత్వమును, డు ప్రత్యయమును జేరును. పశుపక్ష్యాదులను, అచేతనములను బోధించునవి యయినచో 'ము' అను ప్రత్యయము చేరును. స్త్రీలను బోధించుచో ఆలు శబ్దముతో సమాసములగును.

ఉదా:- బల్లిద-బల్లిదుఁడు, అక్కజ-అక్కజము, కావర-కావరము, బెట్టిద-బెట్టిదము, బెడిద-బెడిదము, బల్లిద-బల్లిదురాలు.

77. ధాతువు:- క్రియయొక్క మూల రూపమునే ధాతువందురు. దానికిఁ బ్రత్యయములు చేరిన క్రియలగును. ఈ మూల ధాతువులన్నియు ఉకారాంతములుగనే యుండును.

ఉదా:- వండు, తిను, కొను, కొట్టు, తిట్టు మొ॥

78. ధాతుజ విశేషణము:- ధాతువుల వలనఁ బుట్టియు నామవాచకములకు విశేషణములుగా నుపయోగపడు వీనిని ధాతుజ విశేషణములందురు.

ఉదా:- వండు (ధాతువు) వండఁబడిన యన్నము (ఇందు వండఁబడిన అను పదము వండు అను క్రియవలనఁ బుట్టి అన్నము అను దానికి విశేషణమైనది. (ఇది భూతకాలిక ధాతుజ విశేషణము)

చదువు (ధాతువు) చదవనున్న బాలుఁడు (భవిష్యత్కాలిక ధాతుజ విశేషణము)

వండు (ధాతువు) వండుచున్న బాలుఁడు (వర్తమాన కాలిక ధాతుజ విశేషణము)

చదువు (ధాతువు) చదువు బాలుఁడు (తద్ధర్మార్థక ధాతుజ విశేషణము)

ఇట్లే చదివెడి బాలుఁడు, చదివెడు బాలుఁడు అనునవి గూడ తద్ధర్మార్థక ధాతుజ విశేషణములే యగుచున్నవి.

వండు (ధాతువు) వండని యన్నము (ఇది వ్యతిరేకార్థక ధాతుజ విశేషణము)

79. ప్రాతిపదికము :— అర్థము కలిగియుండి, ధాతువుకంటె భిన్నమై, ప్రత్యయము కానిదై యుండు శబ్దమును ప్రాతిపదిక మందురు.

ఉదా:— రామ, గోపాల, బల్లిద మొ॥

80. భాషా భాగములు :— భాషాభాగములు అయిదు. 1. నామవాచకములు, 2. విశేషణములు, 3. సర్వనామములు, 4. అవ్యయములు, 5. క్రియలు.

81. నామవాచకము :— విశ్వాంతరాళములోని ప్రాణుల యొక్కయు, అప్రాణుల యొక్కయు, పేర్లన్నియు నామవాచకములే యగును. నామవాచకములకు విశేష్యములనియు పేరుగలదు.

ఉదా:— రాముఁడు, వనము, ధేనువు, బల్ల, ఆకాశము మొ॥

82. విశేషణము:— నామవాచకము యొక్క గుణము మున్నగు వానినిఁ జెప్పు పదమును విశేషణములందురు. ఎచ్చటను నామవాచకము (విశేష్యము) లేని విశేషణముండదు.

ఉదా:– నల్లని గుఱ్ఱము, మంచి బాలుఁడు.

పై యుదాహరణముల యందు గుఱ్ఱము యొక్క రంగును నల్లని అను పదము చెప్పి దాని విశేషణమైనది. బాలుని యొక్క గుణమును మంచి అను పదము చెప్పి దానికి విశేషణమైనది.

83. సర్వనామము:– సర్వనామము నామ వాచకమునకు బదులుగా ఉపయోగింపఁబడును.

ఉదా:– రాముఁడు మంచి బాలుఁడు. అతనికి చెడ్డబాలురన్న అసహ్యము.

పై యుదాహరణమునందు అతనికి అను పదము బాలునికి బదులుగా ఉపయోగింపఁబడినది.

84. అవ్యయము:– లింగము, వచనము, విభక్తియనునవి లేని దానినే అవ్యయమందురు. అనఁగా ఏ మార్పును లేక ఎల్లప్పుడును ఒకే విధముగా నుండునది యని భావము.

ఉదా: అక్కటా! ఆహా! ఔరా, సర్వథా, సర్వదా, సర॥ మొ॥

85. క్రియ:– ఒక పనిని గూర్చి తెలుపు పదమును క్రియాపదమందురు. ఇవి ధాతువుల వలన నేర్పడును.

ఉదా:– వండు (ధాతువు)

80. క్రియాపదముల వినియోగము :– వీనికి ఏకవచన మనియు బహువచన మనియు రెండు వచనము లుండును. ఇంకను 1. వర్తమాన కాలము, 2. భూతకాలము, 3. భవిష్యత్కాలమునని మూఁడు కాలము లుండును. ఏకవచన బహువచనములతో వానిని రెట్టించినచో ప్రతి

ధాతువునకును ఆరు రూపములు తప్పక యేర్పడును. వానిని మరల ప్రథమ పురుషము, మధ్యమ పురుషము, ఉత్తమ పురుషము లను భేదముచే పదునెనిమిది భేదములగుచున్నవి.

ఈ క్రింద నున్న రూపములను గమనించిన తెల్లమగును.

| | వర్తమాన ఏక | వర్తమాన బహు |
|---|---|---|
| ప్రథమ పురుషము | వండుచున్నాఁడు | వండుచున్నారు |
| మధ్యమ పురుషము | వండుచున్నాడు | వండుచున్నారు |
| ఉత్తమ పురుషము | వండుచున్నాను | వండుచున్నాము |
| | భూతకాల ఏక | భూతకాల బహు |
| ప్రథమ పురుషము | వండెను | వండిరి |
| మధ్యమ పురుషము | వండితివి | వండితిరి |
| ఉత్తమ పురుషము | వండితిని | వండితిమి |
| | భవిష్యత్తు ఏక | భవిష్యత్తు బహు |
| ప్రథమ పురుషము | వండఁగలఁడు | వండఁగలరు |
| మధ్యమ పురుషము | వండఁగలవు | వండఁగలరు |
| ఉత్తమ పురుషము | వండఁగలను | వండఁగలము |

87. నామవాచక విభక్తులు:— డు, ము, వు, లు ప్రథమావిభక్తి

| | |
|---|---|
| నిన్, నున్, లన్, కూర్చి, గుఱించి | ద్వితీయా విభక్తి |
| చేతన్, చేన్, తోడన్, తోన్ | తృతీయా విభక్తి |
| కొఱకున్, కై | చతుర్థీ విభక్తి |
| వలనన్, కంటెన్, పట్టి | పంచమీవిభక్తి |

కిన, కున్, యొక్క, లోన్, లోపల్ షష్ఠీ విభక్తి
అందున్, నన్ సప్తమీ విభక్తి
ఓ, ఓయి, ఓరి, ఓసి సంబోధన ప్రథమా విభక్తి

88. విభక్తి :- విభక్తి నామవాచకము యొక్క లింగమును వచనమును విభక్తిని తెలుపును.

89. క్రియా ప్రత్యయములు :- ఇవి క్రియాపదముల యొక్క కాలమును, వచనమును, పురుషములను దెలుపును.

90. ఔప విభక్తికములు :- ఇవి విభక్తి ప్రత్యయములకు సమీపమున వచ్చి చేరుచుండును గాన వీనికి ఔపవిభక్తికములు అను పేరు వచ్చినది.

ఇ టి తి అను మూడింటికిని ఔప విభక్తికములని తెలుఁగువ్యాకరణమున పేరు పెట్టినారు. ఇవి కొన్ని నామవాచకములకు ద్వితీయ మొదలు సప్తమి వఱకు గల విభక్తుల యందు ఏకవచనమున మాత్రమే వచ్చును.

'ఇ' ఊరు మొదలగువాని చివరి యక్షరమునకు ద్వితీయాద్యేక వచన ప్రత్యయములు పరమైనపుడు ఇకారము ఆదేశముగా వచ్చును.

ఉదా :- ఊరు—ఊరిని, ఊరిచేత, ఊరికొఱకు................
కాలు—కాలిని, కాలిచేత, కాలికొఱకు...... ॥మొ॥

'టి'. గోరు మొదలగువాని చివరి యక్షరమునకు 'టి' అను నక్షరము ఆదేశముగా వచ్చును. (ఇచ్చట చివరి యక్షర మనఁగా అచ్చుతోఁ గూడిన హల్లు అని గ్రహింపనగును,

ఉదా :- గోరు—గోటిని, గోటిచేత, గోటికొరకు......
ఏఱు—ఏటిని, ఏటిచేత ఏటికొఱకు......॥మొ॥

'తి'. గోయి మొదలగువాని యంత్యాక్షరమునకు 'తి' అదేశముగా వచ్చును.

ఉదా :- గోయి–గోతిని, గోతిచేత, గోతికొఱకు......

నూయి, నూతిని, నూతిచేత, నూతికొఱకు......మొ॥

91. మహద్వాచకము : పురుషులను బోధించు పదములును వాని విశేషణములును మహద్వాచకము లగును.

ఉదా :- సుగుణాభి రాముఁడు' రాముఁడు (ఇందు మొదటి విశేషణ పదమును రెండవ నామవాచక పదమును మహద్వాచకములు)

92. మహతీ వాచకము :- స్త్రీలను బోధించు పదమును, వాని విశేషణములును మహతీ వాచకము లనఁబడును.

ఉదా :- పతివ్రత సావిత్రి (ఇందు మొదటి విశేషణ పదమును రెండవ నామవాచక పదమును మహతీ వాచకములు.

92. అమహద్వాచకము :- పశు పక్ష్యాదులను బోధించు పదములును అచేతనములను బోధించు పదములును వాని విశేషణములును అమహత్తు లనఁబడును.

1. ఉదా:- నల్లని మేక (ఇందు మొదటి విశేషణ పదమును తరువాతి నామవాచక పదమును అమహద్వాచకము లగుచున్నవి.)

2. ఉదా :- ఱెక్కలు లేని పక్షి (ఇందు మొదటి విశేషణ పదమును తరువాతి నామవాచక పదమును అమహద్వాచకము లగుచున్నవి).

3. ఉదా :- ఎత్తైన కొండ (ఇందు మొదటి విశేషణ పదమును తరువాతి నామవాచక పదమును అమహద్వాచక పదములే యగుచున్నవి.)

94. అచ్చికము :- అచ్చికమనఁగా అచ్చ తెనఁగు పదమని యర్థము. ఇందు తద్భవములు గూడఁ జేరును.

ఉదా :- ఊరు, పేరు, బుద్ధి మొ॥

95. ఆత్మనేపదము :- ఏ క్రియ యొక్క ఫలము కర్తకు చెందునో ఆ క్రియను ఆత్మనేపద మందురు. ఇందు ధాతువు చివర 'కొను' అనునది అనుప్రయుక్తమగును.

ఉదా :- రాముఁడు అన్నమును వండుకొనుచున్నాఁడు (తన కొఱకని యర్థము).

పై యుదాహరణమున వండుకొనుట యను క్రియ యొక్క ఫలితము కర్తకు చెందుచున్నది గాన వండుకొను అను క్రియ ఆత్మనేపదము.

96. పరస్మైపదము :- ఏ క్రియ యొక్క ఫలము కర్తతోఁబాటు ఇతరులకును చెందునో ఆక్రియను పరస్మైపదమందురు. ఇందు ధాతువునకు 'కొను' అనునది యనుప్రయుక్తము కాదు.

ఉదా :- రాముఁడు అన్నమును వండినాఁడు (ఇందు వండినాఁడు అను క్రియయొక్క ఫలము ఎవరికైన చెందవచ్చును, కాన నిది పరస్మైపదము).

97. కర్తర్థక వాక్యము (కర్తరిప్రయోగము :- కర్త ప్రథమలోను, కర్మ ద్వితీయలోను ఉన్న వాక్యమును కర్తర్థ వాక్యమనియు, కర్తరిప్రయోగమనియు నందురు.

ఉదా :- రాముఁడు కుక్కను కొట్టెను.

98. కర్మార్థక వాక్యము (కర్మణిప్రయోగము) :- కర్తతృతీయలోను, కర్మ ప్రథమలోను ఉన్న వాక్యమును కర్మార్థక వాక్యమనియు, కర్మణి ప్రయోగమనియు నందురు. ఇందు ధాతువునకు చివర 'పడు' అనునది తప్పక చేరును.

ఉదా :- రామునిచేత కుక్క కొట్టఁబడెను.

99. ప్రేరణార్థకము:- ఇతరులచే క్రియ చేయించుచున్నట్లు చెప్పు క్రియను ప్రేరణార్థకమందురు. ఇందు ధాతువునకు చివర ఇంచు, చు, పు అనునవి చేరుచుండును.

ఉదా :- పండు (ధాతువు) పండించుచున్నాఁడు ఇంచు (చేరినది) తిను (ధాతువు) తినుచున్నాఁడు (చు చేరినది) చూచు (ధాతువు) చూపుచున్నాఁడు (పు చేరినది)

100. అపత్యార్థకము:- అపత్యార్థమున పదమునకు తద్ధిత ప్రత్యయముచేరుటచే అపత్యార్థక పదమేర్పడును. అపత్యమనగా సంతతియని యర్థము.

ఉదా :- దశరథుఁడు—దాశరథి (దశరథునియొక్క కుమారుఁడు)

కుంతి—కౌంతేయుఁడు (కుంతియొక్క కుమారుఁడు)

పృథ—పార్థుఁడు (పృథయొక్క కుమారుఁడు)

101. గోత్రా పత్యార్థకము :- ఒక గోత్రాపత్యా సంబంధించిన సంతతి వాఁడనునర్థము తద్ధిత ప్రత్యయము చేరుటచే గోత్రాపత్యార్థకమేర్పడును. గోత్ర మనఁగా వంశమని యర్థము.

ఉదా :- కురువు–కౌరవుఁడు (కురువంశస్థుఁడు), భరద్వాజుఁడు- భారద్వాజుడు (భరద్వాజుని వంశస్థుఁడు)

102. త్వార్థము (భావార్థము) :- సంస్కృత పదమైనచో భావార్థ మున 'త్వ' అనునది చేరును. తెలుఁగుపదమైనచో 'తన' అనునదిచేరును.

ఉదా :- కవి–కవిత్వము (కవియొక్క భావము)

దొంగ–దొంగతనము (దొంగయొక్క భావము)

103. మతు బర్థము :- (కలది, కలవాఁడు అను అర్థము నిచ్చు ప్రత్యయములు చేరిన పదములు):- కా, కత్తె, కత్తియ, అరి, ఈఁ, (తెలుగు ప్రత్యయములు) వత్, మత్ (సంస్కృత ప్రత్యయములు)

ఉదా :- ఆటకాఁడు, ఆటకత్తె, ఆటకత్తియ, వెరవరి, గారడీఁడు (తెలుఁగు) భాగ్యవంతుఁడు, బుద్ధిమంతుఁడు (సంస్కృతము)

104. స్వార్థము:- నామవాచకములకు చివరచేరి అర్థమునమార్పు కలిగింపని కొన్ని ప్రత్యయములు కలవు. వానిని స్వార్థములందురు.

ఉ :- చెలి–చెలికాఁడు. కల్లరి–కల్లరీఁడు ॥మొ॥

105. తద్ధర్మార్థకము :- (14వ అంశమును చూడుఁడు) :- ఈ తద్ధర్మకాలము, తాచ్ఛీల్యార్థము నందును (తచ్ఛీలము) సంభావనార్థము నందును, సంప్రశ్నార్థమునందును, సాతత్యార్థమునందును, వర్తమానార్థ మునందును, ఆశీరర్థమునందును ఉపయోగింపఁబడును.

ఉదా ;- 1. మేఘములు వర్షించును (తాచ్ఛీల్యమునకు)

2. ఇప్పటి కతఁడు చేరియుండును (సంభావన)

3. ఉందునా? పోదునా? (సంప్రశ్నము)

4. సర్వము నందీశ్వరుండుండును (సాతత్యము)

5. సర్వము నీశ్వరుని యందుండును (వర్తమానము)

6. వాఁడు రేపు పోవును (భావి)

7. నీకు మేలగును (ఆశీస్సు)

106. భావ లక్షణము :- ఇతర క్రియకు భావలక్షణభూతమగు క్రియను భావలక్షణ మందురు. ఇట్టి భావలక్షణ క్రియకు చివర అన్ అనునది చెరును.

ఉదా :- రాముఁడువండ నతిథి వచ్చెను.

107. దఘ్నార్థకము:- లోతు అను నర్థమున బంటి, కొలది అనునవి పదమునకు చివర చేరును.

ఉ:- మోకాలు బంటి, మోకాలు కొలది. (మోకాలులోతు)

మొలబంటి, మొల కొలది (మొల లోతు)

కటి బంటి, కటికొలది (నడుము తోతు)

108. మానార్థకము:- కొలతను దెలియఁజేయు పదమును మానార్థక మందురు. ఈ యర్థమున పదమునకు చివర 'ఎడు' అనునది చేరును.

ఉ:—మాన—మానెడు, జేన—జేనెడు. మూర—మూరెడు.

97. పురుషము:- నేను, నీవు, అతఁడు అనునవి కర్తలుగానున్నప్పుడు క్రియలలో వచ్చు మార్పులను దెలుపునవి పురుషములు. ఇవి మూడు విధములు.

1. ప్రథమ పురుషము, వండుచున్నాఁడు-వండుచున్నారు

2. మధ్యమ పురుషము: వండు చున్నావు—వండుచున్నారు

3. ఉత్తమ పురుషము. వండుచున్నాను—వండుచున్నాము.

98. వచనము:- ఇది ఏకవచన మనియు బహువచన మనియు రెండు విధములు.

ఏకవచనము ఏకత్వమును బోధించును. బహువచనము బహుత్వమును బోధించును. అనఁగా ఒకే పదార్థమును బోధించునది ఏకవచనము అంతకంటె నెక్కువ పదార్థములను బోధించునది బహువచనము.

ఉదా:- బల్ల (ఏకవచనము)

బల్లలు (బహువచనము)

99. నిత్య బహువచనములు :- కొన్ని పదములు ఎల్లప్పుడును బహువచనములోనే యుండును. వానిని నిత్య బహువచనము లందురు.

ఉగా :- 1. అందఱు మొదలగునవి :- అందఱు, ఇందఱు, కొందఱు, ఎందఱు.

2. ధాన్య వాచకములు:- వడ్లు, పెసలు, మినుములు, కందులు, రాగులు, చోళ్లు, మొ॥

3. కొన్ని క్రీడలు:- ఒప్పుల కుప్పలు, ఓమన గుంటలు, కనుమూసి గంతలు. మొ॥

100. కాలములు సహజముగా మూఁడు. ఇవి క్రియకు సంబంధించినవి.

1. వర్తమాన కాలము :- పని జరుగుచున్నచో ఈ కాలము వ్యవహరింపఁబడును,

ఉదా :- వండుచున్నాఁడు — వండుచున్నారు.

2. భూతకాలము:- పని జరిగిపోయినచో ఈకాలము వ్యవహరింపఁబడును.

ఉదా:- వండెను — వండిరి.

3 భవిష్యత్కాలము:- పని మున్ముందు జరుగవలసి యున్నచో ఈ కాలము ఉపయోగింపఁబడును.

ఉదా:- వండఁగలఁడు — వండఁగలరు.

మూఁడు కాలములకును జెందిన తద్ధర్మకాల మింకొంకటి కలదు. ఇది తాల్బిల్యాదులను దెలుపును.

ఉదా:- వండును, వండెడిని మొ॥

101. విధ్యర్థకము:- ఒక పనిని చేయుమని భృత్యులు మొదలయినవారి నాజ్ఞాపించుట పట్టున నీ విధ్యర్థకపద ముపయోగింపబడును.

ఈ విధ్యర్థకమున ధాతువు చివర 'నది' అనునది చేరును.

ఉదా:- నీవాపని చేయునది. మీరాపని చేయునది.

102. సంప్రార్థనార్థకము:- ఇది ప్రార్థనార్థకమును బోధించు క్రియారూపము.

ఉదా:- వండుఁడు, వండుఁడీ, వండరయ్యా, వండరమ్మ మొ॥

103. ఉభయప్రార్థనార్థకము:- ఇది ఇద్దఱు కలిసి ప్రార్థించు విషయమును దెలుపు దానిని ఉభయ ప్రార్థనార్థక మందురు.

ఉదా:- మన మిర్వురమును దీనిని చేయుదము.

104. తృవర్థ కార్థకము :- ధాతువునకు ఎడి, ఎడు, అనునవి తృవర్థకార్థకమునఁ జేరును.

ఉదా:- వండెడివాఁడు, వండెడువాఁడు, వండువాడు. (ఈ ప్రత్యయములు లేకుండఁ గూడ ధాతువు ప్రయోగింపఁబడును.)

105. వ్యతిరేక తృవర్థకార్థకము;- ధాతువునకు 'అని' అనునది చేరి వ్యతిరేక తృవర్థకార్థకము నిచ్చును.

ఉదా:- వండు — వండనివాఁడు.

106. వర్తమానార్థక శత్రర్థకము:- ఈ యర్థమున ధాతువునకు చివర 'చున్' అనునది చేరి అటుపిమ్మట 'ఉన్న' అనునది యను ప్రయుక్తమగును.

ఉదా:- వండుచున్నవాఁడు.

107. భవిష్య దర్థక శత్రర్థకము:- ఈ యర్థమున ధాతువునకు చివర 'అన్' అనునది చేరి పిమ్మట 'కల' అనునది చేరును.

ఉదా:- వండఁ గలవాఁడు.

108. క్తవదర్థకము;- ఈ యర్థమున ధాతువునకు చివర 'ఇన' అనునది చేరును.

ఉదా:- వండినవాఁడు.

104. 105, 106, 107, 108 సంఖ్యలు గలవానినే ధాతుజ విశేషణములని వ్యవహరింతురు.

109. కృదంతము :- కృత్తులనునవి ప్రత్యయములు. ఇవి ధాతువుల చివరచేరి వానిని నామవాచకములనుగా మార్చును. అట్టి

ప్రత్యయములు చివరగల పదములను కృదంతము లందురు.

కొన్ని ధాతువులకు కొన్ని ప్రత్యయములు చేరఁగా నేర్పడిన నామవాచకముల నీ క్రింద గమనింపనగును. (కృదంతములు)

| ధాతువు | కృదంతము |
|---|---|
| చేయు | చేత (త) |
| కోయు | కోత |
| మేయు | మేత |
| కూయు | కూత |
| మ్రోయు | మ్రోత |
| నేయు | నేత |
| పోయు | పోత |
| తీయు | తీత |
| కోరు | కోరిక (ఇక) |
| చేరు | చేరిక |
| అమరు | అమరిక |
| మొలచు | మొలక (క) |
| వచ్చు | రాక |
| అడఁగు | ఆడకువ (కువ) |
| ఆడు | ఆట (ట) |
| పాడు | పాట |
| వండు | వంట |
| పడు | పాటు (టు) |
| చెడు | చేటు |
| కలుగు | కలిమి (ఇమి) |
| నేరుచు | నేరిమి |

| | |
|---|---|
| పీచు | పీవన (వన) |
| మను | మనుగడ (గడ) |
| పూను | పూనికి (ఇకి) |
| మురియు | మురిపము (ప) |
| అమ్ము | అమ్మకము (అక) |
| నమ్ము | నమ్మకము |
| కాచు | కాపు (పు) |
| గిలిగించు | గిలిగింత (త) |

110. తద్ధితాంతములు:— నామవాచకముల చివరను, విశేషణముల చివర కొన్ని యర్థములలోనికి చేరును. ఈ తద్ధిత ప్రత్యయములు చివర గల పదములను తద్ధితాంతము అందురు.

| | |
|---|---|
| ఉదా :— చుట్టము | చుట్టఱికము (ఱికము) |
| పేద | పేదఱికము |
| బీద | బీదఱికము |
| మేన | మేనఱికము |
| కోడలు | కోడంట్రికము |
| పెద్ద | పెద్దతనము |
| గొప్ప | గొప్పతనము |
| చిన్న | చిన్నతనము |
| వేడి | వేడిమి |
| చెలి | చెలిమి |
| అలస | అలసత్వము |
| కవి | కవిత్వము |
| నరుఁడు | నరత్వము |

| | |
|---|---|
| మాయ | మాయాలాడి |
| దౌర్జన్యము | దౌర్జన్యవంతుఁడు |
| తెల్ల | తెల్లన |

111. ప్రత్యయము:– ఇది నామమునకును క్రియకును వ్యాకరణ సూత్రములచే విధింపఁబడును. దీనికే వర్గకమనియు పేరు.

ఉదా :– డు, ము. వు, లు, మొదలగునవి. ఇవి నామవాచకములకు చేరు ప్రత్యయములు.

చున్నాఁడు‘ తిను, రి, తివి, తిరి, మొదలగునవి. ఇవి క్రియలకు చివరఁ జేరు ప్రత్యయములు.

ఇమి, క, త, ట, మొదలగునవి. ఇవి ధాతువులకు చివరఁ జేరి వానిని నామవాచకములనుగా మార్చు ప్రత్యయములు. కృత్తులు. తన, ఱిక, అరి మొదలగునవి. ఇవి నామవాచకములకు కొన్ని యర్థములలో చేరును.

112. ప్రకృతి భావము :– ఏ పదమైన పదభాగమైనను సూత్రముల వలన మార్పు చెందకున్నచో దానిని ప్రకృతి భావమందురు. దీనినే స్వత్వమనియు నందురు.

ఉదా :– పాడెను గంధర్వుఁడు (ఇచ్చట ద్రుతమునకు ప్రకృతి భావము).

113. సముచ్చయము :– ఒకేచోట అన్వయించు ఒకే విధము లయిన పదములను గలుపు ప్రత్యయములను సముచ్చయము లందురు.

ఉదా :– రవియు చంద్రుఁడును అమావాస్య నాఁడు కలసి యుందురు.

పై యుదాహరణమున యు, ను, అనునవి కలవు. వానినే సముచ్చయము లందురు.

ఉకారాంత శబ్దముల చివర 'ను' అనునదియు తక్కిన అచ్చులు చివరనున్న పదములపైన 'యు' అనునదియు వచ్చి చేరును.

114. సంయుక్తాక్షరము :– రెండు గాని అంత కెక్కువ గాని భిన్నములైన హల్లులుకూడి ఒకే యక్షరముగా నున్నచో దానిని సంయుక్తాక్షరమందురు.

ఉదా :- రక్తము, స్త్రీ, శిక్ష,

115. ఆదేశ సరళములు:– పరుషాక్షరములయిన కచట తపలకు ఆదేశములుగా వచ్చిన సరళాక్షరములను ఆదేశ సరళములందురు:

ఉదా :– పూచెను + కలువలు = పూచెను గలువలు (ఇచట కకారమునకు గ కారము ఆదేశముగా వచ్చినది. ఇట్టి దానినే ఆదేశ సరళమందురు.

116. పూర్వపదము :– సమాసము అర్థవంతములయిన రెండు పదముల కూడికవలన నేర్పడును. ఆ రెండు పదములలోని మొదటి పదమును పూర్వపద మందురు.

ఉదా :– శ్వేత తురంగము (ఇందు శ్వేత అనునది పూర్వపదము)

117. ఉత్తరపదము :– సమాసము నందలి రెండవ పదమును ఉత్తరపద మందురు.

ఉదా :– శ్వేత తురంగము (ఇందు తురంగము అనునది ఉత్తరపదము).

118. సమాసము:— సూ:— అర్థవంతములయిన రెండు పదములు కలిసి యేకపదమగుట సమాసమనఁబడును.

ఉదా :— నల్లగుఱ్ఱము (ఇందు నల్ల, గుఱ్ఱము అను రెండును ప్రసిద్ధములయిన యర్థములు గలవి),

119. సమానాధికరణము .— అధికరణము అను పదమునకు ఆధారమని యర్థము. సమానమయిన యాధారముగల దానిని సమానాధికరణమందురు. ఇది సమాసమునకు సంబంధించినది. ద్విగు సమాసమును, కర్మధారయ సమాసమును సమానాధికరణములగును.

ఉదా :— త్రినేత్రములు. శ్వేతాశ్వము (తెల్లని గుఱ్ఱము) నేత్ర ధర్మమును త్రియను సంఖ్యా స్వభావమును ఒక దానినే యాశ్రయించి యున్నవి. గాన పైద్విగు సమాసపదము సమానాధికరణము కలదియైనది. ఇట్లే తెల్లని గుఱ్ఱము అను దానిలో తెల్లఁదనమును, గుఱ్ఱము ధర్మమును ఒక దానినే ఆశ్రయించి యున్నవిగాన నీకర్మధారయ సమాసపదము గూడ సమానాధికరణముగలది యగుచున్నది).

120. వ్యధికరణము :— సమాసములో పూర్వోత్తర పదార్థముల యాధారములు వేర్వేఱుగా నున్నచో దానిని వ్యధికరణమందురు.

ఉదా :— చోరభయము—చోరుని వలన భయము. (ఇందు చోర ధర్మమునకును భయస్వభావమునకును ఆధారములు వేర్వేఱుగనున్నవి. గాన నిచట వ్యధికరణ మున్నదని గ్రహింపనగును).

121. కారకము:— క్రియతో నన్వయమును పొందు దానిని కారకమందురు. ఇది. 1. కర్తృకారకము, 2. కర్మకారకము, 3. కరణ కార

కము, 4. సంప్రదాన కారకము, 5. అపాదాన కారకము, 6. అధికరణ కారకము అని ఆరు విధములుగా నుండును.

ఉదా:-రాముఁడు కొట్టెను (కర్తృకారకము)
కుక్కను కొట్టెను (కర్మ కారకము)
కఱ్ఱతో కొట్టెను (కరణ కారకము)
బీదలకొఱకు అన్నదానము చేసెను (సంప్రదాన కారకము)
మేఘము నుండి పిడుగుపడెను (అపాదాన కారకము)
నీటియందు నిప్పున్నది (అధికరణ కారకము)

షష్టి కారకము కాదు. అది క్రియతో నన్వయింపదుగాన నదికారకముగా గణింప వీలులేదు.

ఉదా:- రాముని యిల్లు (ఇచట రామునియొక్క యిల్లు అని సంబంధార్థముతోనే షష్టి యిముడు చున్నది.)

122. విగ్రహ వాక్యము:- సమాసమును వివరించి చెప్పు వాక్యమును విగ్రహ వాక్యమందురు.

ఉదా:- పద్మాక్షి=పద్మములవంటి అక్షములు గలది.

123. క్రియా విశేషణము:- క్రియయొక్క విశేషమును చెప్పు పదమును క్రియా విశేషణ మందురు.

ఉదా:- శీఘ్రముగాఁ బయనించున్నాఁడు (ఇందు శీఘ్రముగా అను పదము పయనించుటయను క్రియ యొక్క విశేషమును తెలిపినది)

124. క్రియాజన్య విశేషణము;- క్రియా పదమునుండి పుట్టిన విశేషణ పదమని యర్థము.

ఉదా:- నవ్వుచున్న బాలుఁడు (ఇందు నవ్వుచున్న అను విశేషణ పదము నవ్వుఅను ధాతువునుండి పుట్టినది)

# 2. సంస్కృత సంధులు

తెలుఁగు భాషకు సంస్కృత భాషతో సన్నిహిత సంబంధము గలదు. అవినాభావ సంబంధముకల దన్నను అసత్యము కాదు. కావున సంస్కృత భాషలోని సమాస పదములు సరాసరి తెలుఁగు భాషలోఁ జేర్పఁబడును. అట్టి సమాస పదములలో సంధులుండును. అట్టి సంస్కృత సంధుల స్వరరూపములు తెలియకుండ సమాసపదములను విడఁదీయుట సాధ్యపడదు. పదస్వరూపము తెలియనిదే అర్థమగుట దుర్లభము. కావున సంస్కృత సంధులు తప్పక నేర్వఁదగియున్నవి.

ఇవి అచ్ సంధులనియు, హల్ సంధులనియు రెండు విధములు.

## 1. అచ్ సంధులు :

ఇవి 1. సవర్ణ దీర్ఘసంధి, 2. గుణసంధి, 3. వృద్ధిసంధి, 4. యణాదేశసంధి యని నాలుగు విధములు.

1. సవర్ణదీర్ఘసంధి :-

సమానములయిన వర్ణముల కలయికవలన వాని దీర్ఘము ఏర్పడు సంధిగాన దీనిని సవర్ణ దీర్ఘసంధి యనిరి.

**సూ:-** అకారమునకు అకారము ప్రక్కనున్నచో ఆకారమును, ఇకారమునకు ఇకారము ప్రక్కనున్నచో ఈకారమును, ఉకారమునకు ఉకారము ప్రక్కనున్నచో ఊకారము, ఋకారమునకు ఋకారము ప్రక్కనున్నచో ౠకారమును ఆ రెండింటి స్థానము లందును ఆ దేశ

ముగా వచ్చును. అకారమన్న అ ఆ అను రెండింటిని గైకొనసగును. ఇట్లే తక్కిన వానిని గూడ గ్రహింపనగును.

ఉదా:- నీల + ఆకాశము=నీలాకాశము (+ఆ=ఆ)
గిరి + ఇంద్రము=గిరీంద్రము (ఇ + ఇ=ఈ)
మధు + ఉదయము=మధూదయము (ఉ + ఉ=ఊ)
మాతృ + ఋణము=మాతౄణము (ఋ + ఋ=ౠ)

2. గుణసంధి:- ఏ ఓ అర్ అను మూఁడింటికిని వ్యాకరణమున గుణములని పేరు పెట్టఁబడినది. అవి సంధి స్థానమున వచ్చును గాన ఈ సంధికి గుణసంధి యని పేరు వచ్చినది.

సూ:- అకారామునకు ఇకారము ప్రక్కనున్నచో ఏకారమును, అకారమునకు ఉకారము ప్రక్కనున్నచో ఓకారమును, అకారమునకు ఋకారము ప్రక్కనున్నచో 'అర్' అనునదియును అ రెండింటి స్థానము లందును ఆదేశముగా అచ్చును. అకారమన్నచో అ ఆ లు రెండును అన్వయించును.

ఉదా:- రమా + ఈశుఁడు=రమేశుఁడు (ఆ + ఈ=ఏ)
సూర్య + ఉదయము = సూర్యోదయము (అ + ఉ=ఓ)
మహా + ఋషి=మహర్షి (ఆ + ఋ-అర్)

3. వృద్ధిసంధి :- ఐ, ఔ అను రెండింటికిని వ్యాకరణమున వృద్ధులని పేరు. అవి యీ సంధి స్థానమున వచ్చునుగాన దీనికి వృద్ధి సంధి యను పేరు వచ్చినది.

సూ:- అకారమునకు ఏకారముగాని, ఐకారముగాని ప్రక్కనున్నచో ఐకారమును, అకారమునకు ఓకారముగాని, ఔకారముగాని ప్రక్కనున్నచో ఔకారమును ఆ రెండింటి స్థానములందును ఆదేశముగావచ్చును.

ఉదా:- ఏక + ఏకము=ఏకైకము (అ + ఏ=ఐ)
భావ + ఐక్యము=భావైక్యము (అ + ఏ=ఐ)
స్వచ్ఛ + ఓదనము=స్వచ్ఛౌదనము (అ + ఓ=ఔ)
భావ + ఔన్నత్యము=భావౌన్నత్యము (అ + ఔ=ఔ)

4 యణాదేశ సంధి:- సంస్కృత వ్యాకరణములోని మొదటి మాహేశ్వర సూత్రములలో 'హయవరట్, లణ్' అను సూత్రములలోని యకారముతో చివర కాలి ణమును కలిపి పలికిన యణ్ అని యగును. యణ్ణులనఁగా యవరల అనునవి యని యర్థము. ఇవి సంధి స్థానమున ఆదేశముగా వచ్చును గాన ఈ సంధికి యణాదేశ సంధియను పేరు వచ్చినది.

అసవర్ణము అనఁగా సమానము కాని వర్ణము. ఒక అచ్చునకు అదే అచ్చు సవర్ణమగును. వేఱొకటి అసవర్ణ మగును.

సూ:- ఇకారమునకు అసవర్ణ మయిన అచ్చు ప్రక్కనున్నచో యకారమును, ఉకారమునకు అసవర్ణమయిన యచ్చు ప్రక్కనున్నచో వకారమును, ఋకారమునకు అసవర్ణమయిన యచ్చు ప్రక్కనున్నచో రేఫయు (రకారమును) ఆదేశముగా వచ్చును. ఇందు పూర్వపు సంధులలో వలె రెండు అచ్చులును పోవు. మొదటి పదము చివరనున్న అచ్చు మాత్రమే పోయి దాని స్థానమున దానికి చెప్పబడిన యక్కరము వచ్చును. క్రింద చూడనగును.

| ఇ, ఉ, ఋ, | పైయచ్చునకు దాని క్రింది యక్షరము ఆదేశ |
|---|---|
| య్, వ్, ర్, | ముగా వచ్చును. |

ఉదా:- వృద్ధి + అర్థము=వృద్ధ్యర్థము (ఇ + అ = య్ అర్థము. వృద్ధ్ యర్థము=వృద్ధ్యర్థము)

గురు + అర్థము=గర్వర్థము (ఉ + అ=వ్ అర్థము. గుర్ వర్థము =గుర్వర్థము)

మాతృ + అర్చనము = మాత్రర్చనము (ఋ + అ = ర్ అర్చనము, మాత్ రర్చనము=మాత్రర్చ . .)

## 2. హల్సంధి :

1. విసర్గసంధి :- ఇది అనేక విధములుగా నుండును. శ్రద్ధగా గమనించునది.

(1) పొట్టి అకారముతోఁ గూడియున్న విసర్గము గఘ, జఝ, డఢ, దధన, బభమ, యరలవ, హ అను నక్షరములు ప్రక్కనున్నచో ఓకారము గా మారును.

ఉదా:- యశస్ + గణనము=యశోగణనము

యశస్ + ఘనత=యశోఘనత

వయస్ + జ్ఞానము=వయోజ్ఞానము

పయస్ + ఝరము=పయోఝరము

వాసస్ + డంబరము=వాసోడంబరము

యశస్ + ఢంక=యశోఢంక

యశస్ + ద=యశోద

తపస్ + ధనుఁడు=తపోధనుఁడు

తపస్ + నిష్ఠ=తపోనిష్ఠ

తమస్ + బంధురము = తమోబంధురము

తపస్ + భారము = తపోభారము

తమస్ + మందిరము = తమోమందిరము

మహస్ + యాత్ర = మహోయాత్ర

అహస్ + రాత్రములు = అహోరాత్రములు

వయస్ + లావణ్యములు = వయోలావణ్యములు

తమస్ + వికారము = తమోవికారము

మనస్ + హరుఁడు = మనోహరుఁడు

(2) పొట్టి అకారముతోఁ గూడియున్న విసర్గము పొట్టి ఆకారము ప్రక్క నున్నప్పుడు గూడ ఓకారముగా మరును.

ఉదా:— తపస్ + అభిమానము = తపోభిమానము.

(3) శషస అను నక్షరములు ప్రక్కనున్నచో విసర్గమునకు గూడ శషస అనునవి వైకల్పికముగా అదేశములగును.

ఉదా:— మనః + శాంతి = మనశ్శాంతి, మనఃశాంతి.

రక్షః + సంచారము = రక్షస్సంచారము, రక్షఃసంచారము.

చతుః + షష్టి = చతుష్షష్టి, చతుఃషష్టి.

(4) విసర్గము చఛలు ప్రక్కనున్నచో శకారముగా మాఱును.

ఉదా:— మనః + చింత = మనశ్చింత.

తమః + ఛన్నము = తమశ్ఛన్నము.

(5) విసర్గము టఠ అను నక్షరములు ప్రక్కనున్నచో షకారముగా మాఱును.

ఉదా:- ధనుః + టంకృతి=ధనుష్టంకృతి.
ధనుః + ఠంకృతి=ధనుష్ఠంకృతి.

(6) విసర్గము త అను నక్షరము ప్రక్కనున్నచో సకారముగా మాఱును.

ఉదా:- నమః + తే=నమస్తే.

(7) క ఖ ప ఫ అను నక్షరములు ప్రక్కనున్నప్పుడు విసర్గము మార్పు చెందదు.

ఉదా:- రజః + కణము=రజఃకణము.
ధనుః + ఖండము=ధనుఃఖండము.
మనః + పద్మము=మనఃపద్మము.
తపస్ + ఫలము=తపఃఫలము.

(8) కకారము ప్రక్కనున్నప్పుడు విసర్గమునకు కొన్ని విశేషములు కలవు.

ఉదా:- ధనుః + కోటి=ధనుష్కోటి (ష్)
అహః + కరుడు=అహస్కరుఁడు (స్)
భాః + కరుఁడు=భాస్కరుఁడు (స్)
అయః + కాంతము=అయస్కాంతము (స్)

2. అనునాసికసంధి:- కచటతప వర్గములలో మొదటి నాలుగక్షరములకును నకారముగాని, మకారముగాని ప్రక్కనున్నచో వాని యయిదవ యక్షరము ఆదేశముగా వచ్చును.

అనఁగా కవర్గములోని నాలుగక్షరములకును ఙకారమును, చవర్గములోని నాలుగక్షరములకును ఞకారమును, టవర్గములోని నాలుగక్షర

ములకును ణకారమును, తవర్గములోని నాలుగక్షరములకును నకారమును, పవర్గము లోని నాలుగక్షరములకును మకారమును ఆదేశముగా వచ్చునని భావము.

ఉదా:– దిక్ + మాత్రము=దిఙ్మాత్రము (క్ + మా=ఙ్ + మా)
ద్విట్ + నిగ్రహము=ద్విణ్ణిగ్రహము (ట్ + ని=ణ్ + ని)
తత్ + నామము=తన్నామము (త్ + నా=న్ + నా)
అప్ + మయము=అమ్మయము (ప్ + మ=మ్ + మ)

3. శ్చుత్వసంధి:– సకారమునకు శకారము ప్రక్కనున్నచో శకార మాదేశముగా వచ్చును. మఱియు తథదధ అనువానికి చఛజఝ అనునవి ప్రక్కనున్నచో చఛజఝలు ఆదేశముగా వచ్చును.

ఉదా:– మనస్ + శాంతి=మనశ్శాంతి (స్ + శా=శ్ + శా)
విద్వత్ + చయము=విద్వచ్చయము (త్ + చ=చ్ + చ)
దివిషద్ + జనని=దివిషజ్జనని(ద్ + జ=జ్ + జ)

4. జశ్త్వసంధి:– అచ్చులుగాని, గజడదబలుగాని, యరవలుగాని ప్రక్కనున్నచో క చ ట త ప లకు గ జ డ ద బ లు క్రమముగా వచ్చును.

ఉదా:—వాక్ + ఈశుడు=వాగీశుడు (క్ + ఈ=గ్ + ఈ)
త్విట్ + ఆక్రాన్తము=త్విడాక్రాంతము (ట్ + ఆ=డ్ + ఆ)
మృత్ + ఇచ్ఛ=మృదిచ్ఛ (త్ + ఇ=ద్ + ఇ)
వాక్ + గేయకారులు=వాగ్గేయకారులు (క్ + గే=గ్ + గే)
శరత్ + జ్యోత్స్న=శరజ్జ్యోత్స్న (త్ + జ్యో=జ్ + జ్యో
అప్ + ధి = అబ్ధి (ప్ + ధి=బ్ + ధి)
వాక్ + యమనము=వాగ్యమనము (క్ + య=గ్ + య)

వాక్ + వాదము=వాగ్వాదము (క్ + వా=గ్ + వా)
వాక్ + రీతి=వాగ్రీతి (వ్ + రీ=గ్ + రీ)
బృహత్ + విశ్వము=బృహద్విశ్వము (త్ + వి=ద్ + వి)

5. ఛత్వసంధి:— తకారమునకు శకారము ప్రక్కనున్నచో ముందు శ్చుత్వసంధి వచ్చి యా తకారము చకారముగా మారును. పిదప నా శకారము ఛకారముగా మాఱును.

మృత్ + శకటికము, మృచ్ + శకటికము=మృచ్ఛకటికము
(త్ + శ, చ్ + శ, చ్ + ఛ)

బృహత్ + శాసనము, బృహచ్ + శాసనము=బృహచ్ఛాసనము
(త్ + శా, చ్ + శా, చ్ + ఛా)

6. తగాగమసంధి:- హ్రస్వ యక్షరమునకు ఛకారము ప్రక్కనున్నచో తక్ అనునది ఆగమముగా వచ్చును. తక్ అనుటవలన దానిలోని కకారము హ్రస్వ యక్షరమునకుఁదరువాత వచ్చునని తెలిపి వెడలిపోవును. ఇక తకారములోని అకారము ఉచ్చారణ కొఱకు మాత్రమే కాన 'త్' అని మాత్రమే మిగులును.

పరి + ఛేదము=పరిత్ + ఛేదము(శ్చుత్వసంధి) పరిచ్
+ ఛేదము=పరిచ్ఛేదము

శ్వేత + ఛత్రము=శ్వేతత్ + ఛత్రము (శ్చుత్వసంధి)
శ్వేతచ్ + ఛత్రము=శ్వేతచ్ఛత్రము.

7. పరసవర్ణసంధి:- తకారమునకు లకారము ప్రక్కనున్నచో లకార మాదేశముగా వచ్చును.

ఉదా:—విద్యుత్ + లత= విద్యుల్లత(త్ + ల, ల్ + ల=ల్ల)
మరుత్ + లీల=మరుల్లీల (త్ + ల, ల్ + లీ=ల్లీ)

8) పరరూపసంధి:- సంధి రావలసినచోట సంధికాక పూర్వ స్వరము మాత్రము లోపించి పరస్వరము నిలిచియున్నచో దానిని పర రూప సంధి యందురు.

ఉదా:- సీమ + అంతము=సీమంతము (అ + అ,– + అ=అం)

పై యుదాహరణమునందు సవర్ణ దీర్ఘసంధి రావలసియుండగాఁ అట్లు జరుగక పరరూప సంధి వచ్చినది.

ఉదా:- మనస్ + ఈషా=మనీషా (ఇచట సకారముతోఁబాటు దాని పూర్వమున్న అకారము గూడ లోపించినది.

(మన్ + అస్ + ఈషా, + ——ఈషా=మనీషా.
ఇట్లే లాంగల + ఈషా=లాంగలీషా
హల—ఈషా=హలీషా మొ॥

బింబ + ఓష్ఠము=బింబోష్ఠము (ఇచట బింబౌష్ఠము అని వృద్ధిసంధి రావలసియుండఁగా అట్లు జరుగక ఈ పరరూప సంధి వచ్చినది.

9) ప్రకృతి భావసంధి:- సంధికార్య మేదియు జరుగక ఉన్నది యున్నట్లే యగుచో దానిని ప్రకృతిభావసంధి యందురు.

ఉదా;- సప్త + ఋషులు=సప్తఋషులు. ఇచట గుణసంధి వచ్చి సప్తర్షులు అనియు నగును, కాని సంధిరాని స్వరూపము గూడ నుండును. అది ప్రకృతి భావ సంధికి ఉదాహరణము.

# 3· తెలుఁగు సంధులు

1. సంధి నిర్వచన సూత్రము:- పూర్వ పర స్వరంబులకు పర స్వరం బేకాదేశంబగుట సంధియనంబడు. అనఁగా సంధి రావలిసినచోట ముందున్న యచ్చును తరువాతియచ్చును త్రోసివేసి వాని స్థానమున తరువాత యచ్చు అదేశముగా వచ్చుట సంధియగునని భావము.

2. ఉత్వసంధి:- సూ:- ఉత్తున కచ్చు పరంబగునపుడు సంధి యగు.

ఉత్తు=హ్రొట్టి ఉపకారము. పరంబగుట=ప్రక్కన ఉండుట.

అనఁగా హ్రొట్టి ఉకారమునకు ఏదైన అచ్చు ప్రక్కననున్నచో సంధి తప్పక వచ్చునని భావము.

ఉదా:- రాముఁడు + అతఁడు=రాముఁడతఁడు (ఉ + అ=అ)
సోముఁడు + ఇతఁడు=సోముఁడితఁడు (ఉ + ఇ=ఇ)
మనము + ఉంటిమి=మనముంటిమి (ఉ + ఉ=ఉ).

3. వైకల్పిక ఉత్వసంధి:- సూ:- ప్రథమేతరవిభక్తి శత్రర్థ చువర్ణంబులందున్న యుకారమునకు సంధి వైకల్పికముగానగు.

ప్రథమేతరవిభక్తి = ప్రథమకంటె నితరములయిన ఉకారము చివరనున్న విభక్తి ప్రత్యయము లని యర్థము. ఇవి నాలుగు ;- నున్, కొఱకున్, కున్, అందున్

శత్రర్థ చువర్ణము— చున్. పై అయిదింటికిని ఏ అచ్చుప్రక్క నున్నను సంధి వైకల్పికముగా వచ్చునని పై సూత్రభావము. ఈ సంధి చేయునప్పుడు వీని చివరనున్న ద్రుతము 'అచాంసంధౌద్రుతోదృశ్యః' అను నియమము ననుసరించి లోపించును.

ఉదా:– నన్నున్ + అడిగె=నన్నడిగె, నన్నునడిగె.(నున్)
నా కొఱకున్ + ఇచ్చె =నాకొఱకిచ్చె, నాకొఱకునిచ్చె (కొఱకున్)
నాకున్ + ఆధారము=నాకాధారము, నాకు నాధారము (కున్)
నీయందున్ + ఆశ = నీయందాశ, నీయందునాశ (అందున్)
వచ్చుచున్ + ఉండెను=వచ్చుచుండెను, వచ్చుచునుండెను (చున్)

4. అత్వసంధి:— సూ:– అత్తునకు సంధి బహుళముగానగు

(అత్తు = పొట్టి అకారము) సంజ్ఞా ప్రకరణములో 63 వ విషయమును చూడుడు.

ఉదా:– రామ + అన్న=రామన్న (ఇచ్చట సంధినిత్యము)
మేన + అల్లుడు=మేనల్లుడు (ఇటసంధివైకల్పికము)
దూత + ఇతఁడు = దూతయితఁడు (యడాగమము) (సంధిరాలేదు)

యడాగమ విషయమును సంజ్ఞాప్రకరణములో 58 (అ) అను అంశమున, జూడుఁడు.

ఒక + ఒక = ఒకానొక, తామర + అకు = తామరపాకు మొదలగునవి ఇందలి సంధి విశేషములు.

5. ఇత్వసంధి:— (1) సూ:— ఏమ్యాదుల యిత్తునకు సంధి వైకల్పికముగా నగు.

ఏమి, మఱి, కిన్, అది, అవి, ఇది, ఇవి, ఏది, ఏవి, ఇవి ఏమ్యాదులు. వీనియందలి ఇకారమునకు అచ్చు ప్రక్కనున్నచో సంధి వైకల్పికముగా నగును.

ఉదా:— ఏమి + అంటివి = ఏమంటివి, ఏమియంటివి
మఱి + ఏమి = మఱేమి. మఱియేమి
హరికిన్ + ఇచ్చె = హరికిచ్చె, హరికినిచ్చె, ।మొ॥

2. సూ:— క్రియాపదములం దిత్తునకుసంధివై కల్పికముగా నగు.

ఉదా:— వచ్చిరి + అప్పుడు = వచ్చిరప్పుడు, వచ్చిరియప్పుడు
వచ్చితిమి + ఇపుడు = వచ్చితిమిపుడు, వచ్చితిమియిపుడు.

3. సూ:— మధ్యమపురుష క్రియలయం దిత్తునకు సంధియగు.

ఉదా:— ఏలితివి + ఇపుడు = ఏలితివిపుఁడు.
ఏలితి + ఇపుడు = ఏలితిపుడు.
ఏలితిరి + ఇపుడు = ఏలితిరిపుడు.

4. సూ:— క్త్వార్థంబైన యిత్తునకు సంధిలేదు.
వచ్చి + ఇచ్చెను = వచ్చియిచ్చెను.

6. ద్విరుక్త టకారసంధి:- సూ :- కుఱు, చిఱు, కడు, నడు, నిడు శబ్దముల అడల కచ్చుపరంబగునపుడు ద్విరుక్త టకారంబగు.

ద్విరుక్త టకారము=ట్ట్.

ఉదా:- కుఱు + ఉసురు = కుట్టుసురు (ఱు + ఉ=ట్ట్ + ఉ=ట్టు)

చిఱు + ఎలుక=చిట్టెలుక

కడు + ఎదురు=కట్టెదురు

నడు + ఇల్లు=నట్టిల్లు

నిడు + ఊర్పు=నిట్టూర్పు.

7. గసడదవాదేశ సంధి:- సూ:- ప్రథమమీఁది పరుషములకు గసడదవలు బహుళముగానగు.

ఉదా:- వాఁడు + కొట్టెను =వాఁడు గొట్టెను, వాడుకొట్టెను,

అతఁడు + చనియె=అతఁడు సనియె, అతఁడుచనియె

నీవు + టక్కరివి=నీవు డక్కరివి, నీవుటక్కరివి

మీరు + తలఁడు=మీరుదలఁడు, మీరుతలఁడు

అతఁడు + పలికె=అతఁడువలికె, అతఁడుపలికె.

సూ:- తెలుఁగుల మీఁది సాంస్కృతిక పరుషములకు గసడదవలు రావు, వాఁడు + కంసారి=వాఁడు కంసారి.

8. సరళాదేశ సంధి :- సూ :- ద్రుతప్రకృతికము మీఁది పరుషములకు సరళములగు.

పరుషములు :- క చ ట త ప

సరళము:- గ జ డ ద బ

ఉదా :- పూచెను + కలువలు = పూచెను గలువలు

తోఁచెను + చుక్కలు = తోఁచెను జుక్కలు

చేసెను + టక్కులు = చేసెను డక్కులు

నెగడెను + తమములు = నెగడెను దమములు

మొగిడెను + పద్మము = మొగిడెను బద్మము.

4. ద్రుత ప్రకృతిక సంధి :- సూ :- ఆదేశ సరళములకు ముందున్న ద్రుతమునకు బిందు సంశ్లేషములు విభాషనగు.

బిందువు :- ఁ, ం

సంశ్లేషము :- న్.

ఉదా:- పూచెను + గలువలు = పూచెఁగలువలు

పూచెఁ గలువలు

పూచెన్ గలువలు

పూచెను గలువలు(సంధి విభాషగా వచ్చునుగాన ద్రుతమునకుఁ బ్రకృతిభావము)

తోఁచెను + జుక్కలు = తోచెఁ జుక్కలు

తోచెం జుక్కలు

తోచెన్ జుక్కలు

తోచెను జుక్కలు

చేసెను + డక్కులు = చేసెఁ డక్కులు

చేసెం డక్కులు

చేసెన్ డక్కులు

చేసెను డక్కులు

నెగడెను + దమములు=నెగడెఁ దమములు

=నెగడెం దమములు

=నెగడెన్ దమములు

=నెగడెను దమములు.

మొగిడెను + బద్మము=మొగిడెఁ బద్మము

మొగిడెం బద్మము

మొగిడెన్ బద్మము

మొగిడెను బద్మము.

10. సరళ స్థిరసంధి:— సూ:— ద్రుతంబునకు సరళ స్థిరంబులు పరంబులగుచో లోపసంశ్లేషంబులు విభాషనగు.

ఇచ్చట సరళములనఁగా సహజములైన సరళములని భావము.

ఉదా:— వచ్చెను + గోవులు=వచ్చెగోవులు, (సరళమునకు)

వచ్చెన్ గోవులు

వచ్చెను గోవులు.

మెఱసెను + ఖడ్గము=మెఱసెఖడ్గము (స్థిరమునకు)

మెఱసెన్ ఖడ్గము

మెఱసెను ఖడ్గము

సూ : వర్గయుక్ సరళములు పరంబులగునపుడు ఒకానొకచో ద్రుతంబునకుఁబూర్ణబిందువును గానంబడియెడి.

ఉదా:— వచ్చెను + ధాత్రీపతి=వచ్చెధాత్రీపతి

వచ్చెన్ ధాత్రీపతి

వచ్చెం ధాత్రీపతి

వచ్చెను ధాత్రీపతి

పాడెను + గంధర్వుఁడు = పాడెగంధర్వుఁడు

పాడెన్ గంధర్వుఁడు

పాడెం గంధర్వుఁడు

పాడెను గంధర్వుఁడు

కన్ + దోయి = కన్దోయి

కందోయి

సూ:- అవసానంబునందు ద్రుతస్వరంబున కేని, ద్రుతంబున కేని లోపంబు బహుళంబుగా నగు.

అవసానము = వాక్యముయొక్క చివర.

ఉదా:- వాఁడు వచ్చెను, (ప్రకృతిఖానము).

వాఁడు వచ్చెన్ (ద్రుతస్వరలోపము)

వాఁడు వచ్చె (ద్రుతలోపము)

సూ:- కొన్ని యెడల ద్రుతంబుమీఁద నకారంబును గానంబడియెడి.

ఉదా:- అదియునున్ గాక, అదియునుంగాక, అదియునును గాక,

దివంబునున్ బోలె, దివంబునుంబోలె, దివంబునునుబోలె

సూ:- తాను నేను పదంబుల ద్రుతంబునకు సంశ్లేషంబు లేదు

ఉదా: తాను + చదివె = తానుజదివె, తాఁజదివె (అనియుండును)

తాన్ జదివె అని యుండదు.

నేను + కంటిని = నేను గంటిని, నేఁగంటిని (అని యుండును) నేన్గంటిని అని యుండదు.

తాను + వినె = తానువినె, తావినె (అని యుండదు) తాన్వినె (అని యుండదు)

సూ :- సమాసంబులందు ద్రుతంబునకు స్వాత్వంబులేదు.

ఉదా :- చిగురున్ + కయిదువు = చిగురుఁగై దువు, చిగురుంగైదువు

సూ :- తలఁద్రాలు మున్నగు సమాసములందు ద్రుతంబునకు లోపములేదు.

ఉదా :- తలన్ + ప్రాలు = తలఁబ్రాలు

10. ప్రాఁతాది సంధి :- 1. సూ :- సమాసంబునం బ్రాతాదుల తొలియచ్చు మీఁది వర్ణంబులకెల్ల లోపంబు బహుళంబుగా నగు.

సమాసములయందున్న ప్రాఁతాది శబ్దములయందలి మొదటి యచ్చుపైనున్న అక్షరముల కన్నింటికిని లోపము బహుళముగా వచ్చునని భావము.

ఉదా:- ప్రాఁత + ఇల్లు = ప్రాయిల్లు (యడాగమము)
లేఁత + దూడ = లేదూడ

2. సూ :- లుప్త శేషములకుఁ బరుషములు పరంబులగునపుడు నుగాగమంబగు.

ప్రాఁత + కెంపు = ప్రా + కెంపు = ప్రా + ను + గెంపు = ప్రాఁగెంపు

3 సూ :– క్రొత్తశబ్దమున కాద్యక్షర శేషమునకు గొన్నియెడల నుగాగమంబును గొన్నియెడల మీఁదిహల్లునకు ద్విత్వంబునగు.

ఉదా:– క్రొత్త + చాయ = క్రొంజాయ (నుగాగామము)
క్రొత్త + మావి = క్రొమ్మావి (మీఁదిహల్లునకు ద్విత్వము)

4. సూ:– అన్యంబులకు సహిత మికార్యంబు కొండొకచోఁ గానంబడియెడి.

ఉదా:– పది + తొమ్మిది = పందొమ్మిది
కెంపు + ధూళి = కెంధూళి
కెంపు + జడలు = కెంజడలు

బహుళగ్రహణముచే — క్రిందు + నీడ = క్రీనీడ (అనియగును)

11. అమ్రేడిత సంధి :– సూ :– అచ్చున కామ్రేడితంబు పరంబగునపుడు సంధి తఱచుగానగు.

ఆహా + ఆహా = ఆహాహా
ఓహో + ఓహో = ఓహోహో
ఔరా + ఔరా = ఔరౌరా

12. నుగాగమ సంధి :– 1 సూ :– షష్ఠీసమాసములం దొక ఋకారముల కచ్చు పరంబగునపుడు నుగాగమంబగు.

ఉదా:– రాజు + ఆజ్ఞ + న్ఆజ్ఞ = రాజునాజ్ఞ
విధాతృ + ఆనతి = విధాతృ + నానతి (పితృనానతి యనరాదు)

నుగాగమసంధి :– 2. సూ :– ఉదంత తద్ధర్మార్థక విశేణంబుల కచ్చుపరంబగునపుడు నుగాగమంబగు.

ఉదా :– చేయు + అతఁడు = చేయు + న్ + అతడు = చేయు
నతఁడు

వచ్చు + అతఁడు = వచ్చు + న్ + అతఁడు = వచ్చు
నతఁడు

నుగాగమ సంధి:– 3. సూ:– సమాసంబుల నుదంత స్త్రీసమంబులకును, పుంపులకును పరుషసరళములు పరంబులగునపుడు నుగాగమంబగు (సరళాదేశ ద్రుతప్రకృతిక సంధులు)

ఉదా:– చిగురు + కయిదువు=చిగురుఁగయిదువు
చిగురుంగయిదువు
చిగురున్గయిదువు

తళుకు + గజ్జెలు = తళుకుంగజ్జెలు
తళుకున్ గజ్జెలు

సింగము + కొదము = సింగపుంగొదము

ఉన్నతంపు + గొడుగు = ఉన్నతంపుగొడుగు

నుగాగమ సంధి :– 4. సూ :– ఉదంత స్త్రీసమంబులకును పుంపులకును అదంత గుణవాచకంబులకును 'తనము' పరంబగునపుడు నుగాగమంబగు.

ఉదా:– సొగసు + తనము = సొగసుందనము, సొగసుఁదనము
(ఉ. స్త్రీ)

సరసపు + తనము = సరసపుందనము, సరసపుఁదనము
(పుంపు)

తెల్ల + తనము = తెల్లందనము, తెల్లఁదనము
(అదంతగుణవాచకము)

13. రుగాగమ సంధి:— 1. సూ;— కర్మధారయంబులందు పేదాదిశబ్దములకు ఆలు శబ్దంబు పరగబగునపుడు రుగాగమంబగు.

ఉదా:— పేద + ఆలు = పేదరాలు

బీద + ఆలు = బీదరాలు

పేద, బీద, ముద్ద, బాలెంత, మనుమ, గొడ్డుజవ, ఇట్టివి పేదాదులు పై సూత్రము అచ్చతెలుఁగు విషయము.

2. సూ :— కర్మధారయంబునం దత్సమంబుల కాలుశబ్దంబు పరంబగునపుడు అత్వంబున కుత్వంబును రుగాగమంబునగు.

ఉదా :— గుణవంత + ఆలు=గుణవంతురాలు

భాగ్యవంత + ఆలు=భాగ్యవంతురాలు

ధీర + ఆలు=ధీరురాలు

సమర్థ + ఆలు=సమర్థురాలు ॥మొ॥

పై సూత్రము తత్సమపదముల విషయము.

14. టుగాగమ సంధి:— 1. సూ:— కర్మధారయంబులం దుత్తునకిచ్చు పరంబగునపుడు టుగాగమంబగు.

ఉదా :— కఱకు + అమ్ము=కఱకుటమ్ము

నిగ్గు + అద్దము=నిగ్గుటద్దము

సరసము + అలుక=సరసపుటలుక

2. సూ :- కర్మధారయంబులందుఁ బేర్వాది శబ్దములకు అచ్చు పరంబగునపుడు టుగాగమంబు విభాషనగు

ఉదా :- పేరు + ఉరము = పేరుటురము, పేరురము.

చిగురు + ఆకు = చిగురుటాకు, చిగురాకు.

పొదగు + ఇల్లు = పొదరుటిల్లు, పొదరిల్లు.

3. సూ :- షష్ఠీ సమాసమునందును ఇకార్యంబు కొండొకచోఁ గానంబడును.

ఉదా :- వేల్పు + ఆవు = వేల్పుటావు.

వేల్పు + ఎఱు = వేల్పుటేరు.

4. సూ :- ఉదంతములు కాని పదములకుఁ గూడ ఈ టుగాగమ సంధి గానవచ్చును.

ఉదా :- దుక్కి + ఎద్దు + దుక్కిటెద్దు.

పల్లె + ఊరు = పల్లెటూరు.

15. దుగాగమ సంధి :- సూ :- నీ నా తన పదములకు ఉత్తర పదంబు పరంబగునపుడు దుగాగమంబు విభాషనగు.

ఉదా :- నీ + కరుణ = నీకరుణ, నీదుకరుణ.

నా + వశము = నాదువశము, నావశము.

తన + గుణము = తనదుగుణము, తనగుణము.

16. పుంప్వాదేశ సంధి :- సూ :- కర్మధారయంబునందు ముపర్ణకంబునకు పుంపులగు. వర్ణకము = ప్రత్యయము,

ఉదా :- సరసము + మాట = సరసపుమాట, సరసంపుమాట.
విరసము + వచనము = విరసపువచనము, విరసంపు వచనము.

17. పడ్వాది సంధి :- సూ :- పడ్వాదులు పరంబులగునపుడు మువర్ణకంబునకు లోప పూర్ణబిందువులు విభాషనగు.

ఉదా :- భయము + పడు = భయపడు, భయంపడు, భయము పడు.
సూత్రము + పట్టె = సూత్రపట్టె, సూత్రంపట్టె, సూత్రము పట్టె.

ఈ కార్యముకర్తృవాచి మువర్ణకమునకుఁ గలుగదు.

ఉదా :- అశ్వము + పడె = అశ్వముపడె.

18. సమాస సంధి:- సూ :- చేత తోడ వలనల కిత్వంబు సమాసంబునందగు,

ఉదా :- నీచేతన్ + ప్రోపు = నీ చేతి ప్రోపు.
నాతోడన్ + చెలిమి = నాతోడి చెలిమి.
నీవలనన్ + భయము = నీవలని భయము.

19. కడాద్యామ్రేడిత సంధి :- సూ :- ఆమ్రేడితంబు పరంబగునపుడు కడాదులం దొలియచ్చుమీఁది వర్ణంబులకెల్ల నదంతంబగు ద్విరుక్తటకారంబగు.

ఉదా :- కడ + కడ = కట్టకడ (ద్విరుక్తటకారము 'ట్ట')
ఎదురు + ఎదురు = ఎట్టయెదురు.
కొన + కొన = కొట్టకొన.

20. విభక్తిసంధి :- సూ :- ఆమ్రేడితంబు పరంబగునపుడు విభక్తికి లోపంబు బహుళంబుగా నగు.

ఉదా :- అప్పటికిన్ + అప్పటికిన్ = అప్పటప్పటికిన్.

ఊరన్ + ఊరన్ = ఊరూరన్.

ఇంటన్ + ఇంటన్ = ఇంటింటన్.

21. ఇంచుకాదు సంధి :- సూ :- ఇంచుక నాఁడిత్యాదులందు అంతి మాక్షరలోపంబు భావిషనగు.

ఉదా :- ఇంచుక + ఇంచుక = ఇంచించుక, ఇంచుకించుట,

నాఁడు + నాఁడు = నానాఁడు, నాఁడునాఁడు.

22. అందుకు ప్రభృతిక సంధి :- సూ :- అందందుకు ప్రభృతులు యథాప్రయోగంబులు గ్రాహ్యంబులు.

ఉదా :- అదుకు + అదుకు = అందదుకు.

చెదరు + చెదరు = చెల్లాచెదరు.

23. మధ్యమ ముడుజు సంధి :- సూ :- ఆమ్రేడితము పరంబగునపుడు మధ్యమముడుజులకు లోపంబు విభాషనగు.

ఉదా :- ఉండుము + ఉండుము = ఉండుఁము, ఉండుముండుము.

ఉండుఁడు + ఉండుఁడు = ఉండుండుఁడు, ఉండుడుండుఁడు.

24. మూఁడుశబ్ద విశేషసంధి :- 1. సూ :- సమానాధికరణం బగునుత్తరపదంబు పరంబగునపుడు మూఁడు శబ్దము డ. వర్ణంబునకు లోపంబును మీఁదిహల్లునకు ద్విత్వంబునగు.

2, సూ :- ద్విరుక్తంబగు హల్లు పరంబగు నపుడు ఆచ్ఛికంబగు దీర్ఘంబునకు హ్రస్వంబగు.

ఉదా :- మూఁడు + లోకములు = మూ + లోకములు, ము + లోకములు = ముల్లోకములు.

3. సూ :- ద్విగువున కేకవచనంబు ప్రాయికంబుకానగు. మిశ్రమంబునకుగాదు ఈసంధి విషయమున ఆచ్ఛిక సమాసమగుచో సమాసము తఱుచుగా ఏక వచనముగాఁ బూర్తియగును. తెలుఁగు సంస్కృత పదములు కలిసియున్న సమాసమయినచో నేకవచనముతోఁ బూర్తి కాదు.

ఉదా :- మూఁడు + పావులాలు = మూ + పావులాలు,

ము + ప్పావులాలు = ముప్పావులా ముప్పావులాలు అని మాత్రముండదు)

మూఁడు + చిచ్చులు = మూ + చిచ్చులు, ము + చిచ్చులు, ముచ్చిచ్చు (ముచ్చిచ్చులు అని యుండదు).

25. లులనలు :- సూ :- లులనలు పరంబులగునపుడు ముపర్ణకంబునకు లోపంబును, తత్పూర్వస్వరంబునకును దీర్ఘంబును విభాషనగు.

ఉదా :- పవడములు = పవడాలు, పవడాలన్, పవడాన.

వజ్రములు = వజ్రాలు, వజ్రాలన్, వజ్రాన

చుట్టములు = చుట్టాలు, చుట్టాలన్ చుట్టాన

26. తకారాదేశసంధి :- సూ :- చువర్ణకంబుతోడి దుగ్ధకారంబు తకారంబగు.

ఉదా:- వచ్చు + దురు = వత్తురు

వేధించు + దురు = వేధింతురు

27. అపదాది స్వరసంధి :- సూ :- అంద్వాన గాగమంబులంప్వ నదాది స్వరంబు పరంబగునపుడు అచ్చునకు సంధియగు.

ఉదా:- మూర + ఎడు = మూరెడు

పీసె + ఎడు = పీసెడు

మాన + ఎడు = మానెడు

ముంత + ఎడు = ముంతెడు

28. త్రికసంధి:- 1. సూ:- ఆ ఈ ఏ వర్ణంబులు త్రికంబునాఁ బడు. తెలుఁగు వ్యాకరణమునందు ఆ ఈ ఏ అను మూఁడు వర్ణములకును త్రికమని పేరు పెట్టినారని భావము.

ఉదా:- ఆ + కాలము

ఈ + కాలము

ఏ + కాలము

2 సూ:- త్రికంబుమీఁది యసంయుక్త హల్లునకు ద్విత్వంబు బహుళంబుగానగు. ఆ ఈ ఏ అను అచ్చులపైనున్న అసంయుక్త హల్లునకు ద్విత్వము బహుళముగా ఆదేశముగా వచ్చునని భావము.

ఉదా:- ఆ + క్కాలము

ఈ + క్కాలము

ఏ + క్కాలము

3. సూ:- ద్విరుక్తంబగు హల్లు పరంబగుచో ఆచ్ఛికంబగు దీర్ఘంబునకు హ్రస్వంబగు.

ద్విత్తమయిన హల్లు ప్రక్కనున్నచో అచ్చు తెనుఁగునకు సంబంధించిన దీర్ఘము పొట్టిగి యగును అని భావము.

ఆ + కాలము. ఆ + క్కాలము, అక్కాలము

28. పజ్ పవర్ణాదేశము:- సూ:- ఒక్కొనొకచో సమాసము యందు నామ్యాది కనుమ్యాదుల మువర్ణకంబునకు పజ్ పవర్ణంబులగు.

ఉదా:- నాము + చేను=నాపచేను

పేము + బెత్తము=పేపబెత్తము

కనుము + పులు=కనుపపులు

30. పోటి ఆదేశసంధి:- 1. సూ:- బహువ్రీహిని స్త్రీ వాచ్యంబగుచో నుపమానంబు మీఁది మేనునకు 'పోడి' యగు

ఉదా:- పూవు + మేను, పూవు + పోడి=పూఁబోడి

31. అల్లోపసంధి:- సూ - అది యవి శబ్దముల అత్తునకు వృత్తిని లోపంబు బహుళంబుగానగు

అత్తు=పొట్టి అకారము, వృత్తి=సమాసము

నా + అది=నాది, నాయది (సంధిలేనిచో యడాగమము)

నీ + అవి = నీవి, నీయవి (సంధి వచ్చినరూపము, యడాగమము)

32. అనుకరణ విశేష సంధులు:- 1. సూ.- అనుకృతిని నమశ్శబ్దము తుది యత్తునకు ఓత్వము విభాషనగును.

ఉదా :- తుభ్యః నమః + అనె=తుభ్యం నమోయనె తుభ్యం నమయనె.

2. సూ:- అనుకరణంబునంగుఁ దుతిహల్లునకు ద్విత్వంబగు.

ఉదా:- దాసోహమ్ + అనె=దాసోహమ్మనె.

3. సూ:- ఉదంత నామంబున కనుకరణంబునందు వుగాగమంబగు.

ఉదా;- ఇయంధేను. + అనె=ఇయంధేనువనె.

# 4. సమాసములు

అర్థవంతములయిన రెండు పదములు కలిసి ఏకపదమగుట సమాస మనఁబడును అనఁగా అర్థముతోఁ గూడియున్న రెండు పదములు ఒకే పదముగా రూపొందించో దానిని సమాసమందురని భావము.

సాధారణముగా సమాసమునందు రెండు పదము లుండును. సమాస మునకు విగ్రహమనియు పేరు. సమాసములోని మొదటి పదమును పూర్వ పదమనియు, రెండువపదమును ఉత్తరపదమనియు దందురు. సమాసము యొక్క అర్థమును వివరించి చెప్పు వాక్యమును విగ్రహవాక్యమందురు. ఈ సమాసములు తెలుఁగు భాషలో మూఁడు విధములుగా నేర్పడు నుండును.

1. సాంస్కృతికములు.

2 ఆచ్ఛికములు.

3. మిశ్రములు.

## 1. సాంస్కృతిక సమాసములు:

ఇవి సిద్ధములనియు, సాధ్యము లనియు రెండువిధములు.

1. సిద్ధసమాసములు:- సంస్కృత భాషలో సిద్ధములై యుండి తెలుఁగులో మార్పుచేయక యుపయోగింపఁబడిన వానిని సిద్ధసమాసము లందురు.

ఉదా:- రామాజ్ఞ. ఇది సంస్కృత. సమాసపదము. దీనిని సంస్కృతములో సిద్ధమయి యున్న దానినే తెలుఁగులోఁ బ్రయోగించు చున్నాము.

2. సాధ్య సమాసము:- సంస్కృతపదములనే గైకొని తెలుఁగు భాషా సంప్రదాయము ననుసరించి సమాసమును సమకూర్చినచో దానిని సాధ్యసమాస మందురు.

ఉదా:- విధాతృ + ఆనతి=విధాతృనానతి (ఇందు విధాతయొక్క యానతి విగ్రహ వాక్యము వలన షష్ఠీ తత్పురుష సమాసము స్పష్టమగు చున్నది). కాని పైసమాసములోని రెండు పదములును సంస్కృతములే యైనను. షష్ఠీ సమాసమునం దుకారఋకారముల కచ్చు పరంబగునపుడు నుగాగమంబగు, అను సూత్రముచే నుగాగమును సాధించి సాధ్యసమాసము చేయుట జరిగినది. కావున దినిని సాధ్యసమాసపద మనుచున్నాము.

## 2. ఆచ్ఛికములు:

రెండు అచ్చ తెలుఁగు పదములు కలసి ఏకపద మయినచో దానిని ఆచ్ఛికసమాస మందురు.

ఉదా:- తెల్లగుఱ్ఱము (ఇందు రెండుపదములను అచ్చ తెలుఁగులే గావున దీనిని ఆచ్ఛిక సమాసమందురు).

## 3. మిశ్రమసమాసము :

అచ్చ తెలుఁగు పదము పూర్వ పదముగను, సంస్కృత పదము ఉత్తరపదముగను ఉండునట్టు సమాసమును గూర్చినచో దానిని మిశ్రమ సమాస మందురు.

ఉదా:- నల్లని యశ్వము (ఇందు పూర్వపదము అచ్చ తెలుఁగు పదము. ఉత్తరపదము సంస్కృతపదము, ఇట్లున్నచో దానిని మిశ్రమ సమాస మందురు.

ఈమిశ్రమ సమాసము విషయమున ఒకటి గుర్తుంచుకొనవలయును. పూర్వపదము మాత్రమే అచ్చ తెలుఁగు పదముగా నుండనగును గాని పూర్వ పదము సంస్కృతముగాను, ఉత్తరపదము అచ్చ తెలుఁగుగాను ఉండరాదు. అనఁగా మిశ్రమ సమాసమును జేయుపట్టున విధిగా పూర్వ పదము అచ్చ తెలుఁగే అయియుండవలెను. ఉత్తర పదము సంస్కృతమే అయి యుండవలెను. కావున.

అతి బండ, అనేకమాఱులు, అల్పదండు మొదలగునవి తప్పులగు నని భావము.

సమాసములు అర్థముపై నాధారపడి యుండును. అర్థమును బట్టియే సమాసము నిర్ణయింపఁబడును. అర్థము తెలియకున్న సమాస నిర్ణయము సాధ్యపడదు.

అట్టి సమాసము అర్థభేదమును బట్టి ఆఱువిధములుగా నుండును.

1. తత్పురుష సమాసము.
2. కర్మధారయ సమాసము.
3. ద్విగు సమాసము.
4. ద్వంద్వ సమాసము.
5. బహువ్రీహి సమాసము.
6. అవ్యయీభావ సమాసము.

## 1. తత్పురుష సమాసము:

ఈ సమాసము నందు ఉత్తర పదార్థము ప్రధానముగా నుండును. విగ్రహవాక్యమధ్యములో విభక్తి ప్రత్యయము వచ్చును. అప్రత్యయమును బట్టి ఆ విభక్తికి సంబందించిన తత్పురుష మ౦ చుండును.

ఇది ప్రథమా తత్పురుషము మొదలు 7 విభక్తులుగాన ఏడు తత్పురుష సమాసములును, నఞ్ తత్పురుషముతోఁ గలిసి యెనిమిది తత్పురుష సమాసము లగుచున్నవి. అవి ఈ క్రింది విధముగా నుండును.

1. ప్రథమా తత్పురుషము.

ఉదా:— కొనకొమ్మ (కొమ్మయొక్క కొన అని విగ్రహవాక్యము. ఈ విగ్రహ వాక్యమున యొక్క అను ప్రత్యయము మధ్యలో వచ్చినను కొమ్మ అను పదముదకు సంబంధించినదిగాన దీనిని షష్ఠితత్పురుష మని భ్రమ పడరాదు. అర్థము చెప్ప సౌలభ్యమునకై యిట్లు విగ్రహ వాక్యమును జెప్పినాము.

**2.** ద్వితీయా తత్పురుషము (నిన్, నున్, లన్, కూర్చి, గుఱించి)

ఉదా:- పాఠ పఠనము (పాఠమును పఠించుట అనునది విగ్రహ వాక్యము)

విగ్రహ వాక్య మధ్యలో 'ను' అను నది వచ్చినది గాన ఇది ద్వితీయా తత్పురుషమునకు ఉదాహరణ మైనది.

3. తృతీయాతత్పురుషము (చేతన్, చేన్, తోడన్, తోన్)

ఉదా:- దండతాడితుఁడు ('దండముచే తాడింపఁబడినవాడు' అనునది విగ్రహ వాక్యము) విగ్రహవాక్యము మధ్యలో 'చేత' అనునది వచ్చినది గాన ఇది తృతీయా తత్పురుషమున కుదాహరణము.

4. చతుర్థీ తత్పురుషము:- (కొఱకున్, కై)

ఉదా:- ఫలిత నిరీక్ష (ఫలితముం కొఱకై నిరీక్ష' అనునది విగ్రహ వాక్యము) ఈ విగ్రహ వాక్యమున 'కొఱకున్' అను విభక్తి ప్రత్యయము వచ్చినది గాన నిది చతుర్థీ తత్పురుషమున కుదాహరణము.

5. పంచమీ తత్పురుషము (వలనన్, కంటెన్, పట్టి)

ఉదా:- చోరభయము (చోరునివలన భయము అనునది విగ్రహ వాక్యము) ఈ విగ్రహవాక్యము మధ్యలో 'వలన' అనునది వచ్చినది. కావున నిది పంచమీ తత్పురుషమునకుఉదాహరణము.

6. షష్ఠి తత్పురుషము:- (కి, కున్, యొక్క, లోన్. లోపలన్)

ఉదా:- రాజాజ్ఞ ('రాజుయొక్క అజ్ఞ' అనునది విగ్రహ వాక్యము) ఈ విగ్రహవాక్యము మధ్యలో 'యొక్క' అను షష్ఠీవిభక్తి ప్రత్యయము వచ్చినదిగాన నిది షష్ఠీ తత్పురుషమునకు ఉదాహరణము.

7. సప్తమీతత్పురుషము:- (అందున్, నన్)

ఉదా:- వనవాసము ('వనమునందు నివాసము' అనునది విగ్రహ వాక్యము) ఈ విగ్రహ వాక్యమున 'అందున్' అను సప్తమీ విభక్తి ప్రత్యయము వచ్చినదిగాన నిది సప్తమీ తత్పురుష సమాసమునకు ఉదాహరణము.

8. నఞ్ తత్పురుషసమాసము:-

ఈ సమాసము వ్యతిరేకార్థమున నేర్పడును. 'న' అను పదము వ్యతిరేకార్థము గలది. దీనితో నితర పదములు కలిసి సమాస మేర్పడును. ఇది రెండు విధములుగా నేర్పడును.

1. 'న' అను పదముతో అచ్చు మొదట నున్న పదము చేరినచో అది 'అన్' అని మారును.

ఉదా:- న + అవసరము = అన్ + అవసరము = అనవసరము
న + ఇష్టము = అన్ + ఇష్టము = అనిష్టము, కొందఱు అయిష్టము అని వాడుదురు. అది తప్పుకాఁగలదు. అనిష్టము అనియే యుండవలయును.

2. 'న' అనుపదముతో హల్లు మొదటనున్న పదము చేరినచో అది 'అ' అని మాత్రమే మాఱును.

ఉదా:- న + జ్ఞానము = అజ్ఞానము.

## 2. కర్మధారయము:

ఈ సమాసము సందుగూడ ఉత్తర పదార్థమే ప్రధానముగా నుండును. కాని యిందలి పూర్వోత్తర పదార్థములకు విశేషణ విశేష్య భావముగాని, ఉపమానోపమేయ భావముగాని యుండును. దీనినే సమానాధికారణ మందురు. ఇంకను, సంభావన, అవధారణ అను విశేషార్థములుగల పూర్వ పదములలోగూడ రెండువిధములయిన కర్మధారయము లుండును, మొత్తముపై నీ సమాసము ఏడు (7) విధములుగా నుండును. వరుసగా ఉదాహరణతో వివరింపఁబడును.

1. విశేషణ పూర్వపద కర్మధారయము:- ఇందు పూర్వపదము విశేషణముగాను, ఉత్తరపదము విశేష్యముగాను (నామవాచకముగాను) ఉండును.

ఉదా:- శ్వేత + అశ్వము ('శ్వేతమయిన అశ్వము' అని విగ్రహ వాక్యము) ఇందలి నామవాచకమయిన 'అశ్వము' అను పదము ఉత్తరపదముగాను, దానియందలి విశేషమును దెలుపు 'శ్వేత' అను పదము పూర్వపదముగాను ఉన్నది. కాని నిది విశేషణ పూర్వపద కర్మధారయము.

2. విశేషణోత్తరపద కర్మధారయము:- ఇందు ఉత్తర పదము విశేషణముగాను. పూర్వపదము విశేష్యముగాను ఉండును.

ఉదా:- కపోతవృద్ధము ('వృద్ధమయిన కపోతము') అని విగ్రహ వాక్యము) ఇందు 'కపోతము' అను నామవాచక పదము పూర్వపదముగా నున్నది. 'వృద్ధము' అను విశేషణ

పదము ఉత్తరపదముగా నున్నది. కాన నిది విశేషణో
త్తర పదకర్మధారయము.

3. విశేషణోభయపద కర్మధారయము:- ఇందుపూర్వ పదమును ఉత్తరపదమును గూడ విశేషణములేయై యుండును.

ఉదా:- మృదు మధురము ('మృదువును మధురమునైనది' యని విగ్రహ వాక్యము) ఇందుపూర్వపదమును. ఉత్తర వద మును విశేషణములే యగుచున్నవి. కానసిది విశేషణో భయపద కర్మధారయమున కుదాహరణము.

4. ఉపమాన పూర్వ పదకార్మధారయము:- ఇందు పూర్వపదము ఉపమాన బోధకమై యుండును. ఉత్తర పదము నామవాచకమే యగును.

ఉదా:- లతాతన్వి ('లతవంటి తన్వి'యని విగ్రహవాక్యము) ఇందు పూర్వపదమయిన 'లత' ఉపమాన బోధకమయిన పదము. ఉత్తర పదమయిన 'తన్వి' అను పదము నామ వాచకము. కాననిది ఉపమాన పూర్వపద కర్మధారయము నకు ఉదాహరణము.

5. ఉపమానోత్తర పదకార్మధారయము:- ఇందు నామవాచకము పూర్వ పదముగను, ఉపమాన బోధకము ఉత్తరపదముగను ఉండును.

ఉదా:- తనూలత ('లతవంటి తనువు' అని విగ్రహ వాక్యము) అయినను ఉపమాన బోదకపథము ఉత్తర పదముగా నుండుడచే ఉపమానోత్తర పదకర్మధారయ మగు చున్నది.

6. సంభావనా పూర్వపదకార్మధారయము:- ఇందు పూర్వపదము ప్రత్యేక పదార్థనామమును, ఉత్తరపదము జాతి నామవాచకమును అయి యుండును.

ఉదా:- దశరథమహారాజు (దశరథుఁడను మహారాజు) అని విగ్రహ వాక్యము.

7. అవధారణా పూర్వపదకర్మధారయము:-(రూపక సమాసము)

ఉదా:- వాల్మీకి కోకిలము:- (వాల్మీకియను కోకిలము)

## 3. ద్విగువు:

ఉత్తర పదార్థము ప్రధానముగా నుండి పూర్వపదము సంఖ్యా వాచకమయినచో దానిని ద్విగుసమాస మందురు.

ఉదా:- పంచ బాణములు=అయిదయిన బాణములు.

త్రినేత్రములు = మూఁడయిన నేత్రములు.

రెండు కాకులు=రెండయిన కాఁకులు

## 4. ద్వంద్వము:

ఈ సమాసము నందు పూర్వ పదార్థమునకును, ఉత్తర పదార్థమునకును సమానమైన ప్రాధాన్యత ఉండును. ఇందు రెండుపదములును నామవాచకములై యుండును.

ఉదా:- రామలక్ష్మణులు (రాముఁడును, లక్ష్మణుడునుఅని విగ్రహ వాక్యము)పై యుదాహరణమునందు ఏక్రియ జరిగినను వారిరువురును సమముగాఁ జేసిరి అని సమన్వయమగును. రామలక్ష్మణులు అరణ్యమునకు ఏఁగిరి ఇందు అరణ్య

మున కేఁగుట యను క్రియకు రామలక్ష్మణు లిద్దఱును సమముగనే కర్తలగుచున్నారు. ఇది ద్విపదద్వంద్వ మనియు, బహుపదద్వంద్వ మనియు రెండు విధములుగా నుండును. రెండు పదములతోఁ జేసినది ద్విపద ద్వంద్వము. రెండింటి కంటె నెక్కువ పదములతో చేసిన సమాసము బహుపదద్వంద్వము.

ద్విపద ద్వంద్వము:- రామలక్ష్మణులు.

బహుపద ద్వంద్వము:- సీతారామ లక్ష్మణులు.

హనుమత్సీతారామ లక్ష్మణులు మొ॥

తల్లి దండ్రులు

అన్నదమ్ములు ॥మొ॥

పై యుదాహరణమున నన్నిటిని ఇతరేతర యోగద్వంద్వము లనియు వ్యవహరింతురు. అనఁగా అవయవ భేదముగల పదముల సముదాయము ఒక యర్థమునందన్వయించుట యని యర్థము.

ఈ సమాసము పూర్వము చెప్పిన సమాసముల కంటె భిన్నముగా నుండును. ఇందు పూర్వ పదార్థమునకుఁ గాని, ఉత్తర పదార్థమునకుఁ గాని ప్రాధాన్యము ఉండక అన్య పదార్థమునకు మాత్రమే ప్రాధాన్యము ఉండును. దీని విగ్రహ వాక్యములో చివర కలవాఁడు, కలది యనునవి వచ్చును. ఈ గుర్తును బట్టి దీనిని స్వేచ్ఛగా గుర్తింప వచ్చును.

ఉదా:- నీలకంఠుఁడు (నీలమైన కంఠముగలవాఁడు)

పద్మాక్షి (పద్మమువంటి కన్నులు గలది)

పై పదములు సమానాధికరణ బహువ్రీహికుదాహరణములు. ఇంకను వ్యధికరణ బహువ్రీహి, దిగంతరాళ లక్షణబహువ్రీహి మున్నగు భేదము లిందు గలవు. అవి సంస్కృత భాషా పరిచయమున్న గాని బోధపడవు గావున నిటఁజెప్పలేదు.

## 6. అవ్యయీభావ సమాసము:

ఇందు పూర్వ పదము అవ్యయమై ఉత్తర పదముతోఁ గలిసి సమాసమగును. మొత్తము సమాసపదము అవ్యయ మగుట యిందలి విశేషము.

ఉదా:- యథాకాలము (కాలము నతిక్రమింపక, అని విగ్రహ వాక్యము) ఇట్లే ప్రత్యహము, అనురూపము, సమక్షము, ఆబాల వృద్ధము, యథాశాస్త్రము ॥మొ॥

# 5. కారకములు

కారక మనఁగా వాక్యమునందు కర్త కర్మ క్రియలకు గల పరస్పర సంబంధమును దెలుపునది యని యర్థము. ఆరవ విభక్తి తప్ప తక్కినయన్ని విభక్తులకును కారకనామము [illegible]. కావున నివియారు.

1. కర్తృకారకము (ప్రథమ)
2. కర్మకారకము (ద్వితీయ)
3. కరణకారకము (తృతీయ)
4. సంప్రదానకారకము (చతుర్థి)
5. అపాదానకారకము (పంచమి)
6. అధికరణకారకము (సప్తమి)

వాక్యములోని విభక్తి ప్రత్యయముల సందర్భమును కారకము తెలుపును. ప్రథమా విభక్తి సూత్రము.

1. సూ:- ప్రాతిపదిక సంబోధ నోక్తార్థంబులం బ్రథమయగు. ప్రాతిపదిక మనఁగా శబ్దమును పలుకఁగనే తప్పక తోచు అర్థము. సంబోధన మనఁగా **పిలుపు.**

ఉక్తార్థమనఁగా చెప్పఁబడిన యర్థము (క్రియచేఁ జెప్పఁబడినది) పై మూఁడర్థములందును ప్రథమ వచ్చునని భావము.

ఉదా:- రాముఁడు (ప్రాతిపదికార్థము)

కృష్ణుఁడా! (సంబోధనము)

రాముఁడు కుక్కను కొట్టెను (ఇందు క్రియచే కర్తచెప్పఁబడినాఁడు) ధాత్వర్థ వ్యాపారాశ్రయము కర్త

విద్యచేత యంశబు గలుగు (హేతువునకు)

ఖడ్గంబుచేత ఖండించె (కరణమునకు)

జరాసంధుఁడు రాజులచేత కప్పంబుగొనియె | (గ్రహి)

మైత్రుండు చైత్రునిచేత ఋణంబు గొనియె | గ్రహి

ఈ యర్థంబు నీచేత నెఱింగితి (తెలిసికొనుట)

ఈ యర్థంబు నీచేత వింటి (వినుట)

బహుళ గ్రహణముచే పక్షమున వలన వర్ణకము నగు

ఉదా:— ధనమువలన సౌఖ్యంబు గలుగు.

5. సూ:— కరణ సహార్థ తుల్యార్థ యోగంబులం దృతీయకుం దోడ వర్ణకం బగు.

కరణార్థ=సాధనము అను నర్థము.

సహార్థ=కూడ అను నర్థము.

తుల్యార్థ= సాటియను నర్థము.

పై యర్థములలో సంబంధమున్నచో తృతీయకుతోడ అను ప్రత్యయము వచ్చును.

ఉదా:— కోలతోడఁ గూలనేసె (కరణార్థము)

సేనతోడ వచ్చె (సహార్థము)

చైత్రునితోడ మైత్రుండు తుల్యుండు (తులార్థము)

(తోడన్, తోన్)

6. సూ:— వచ్యర్థాముఖ్యకర్మంబునకు తోడ కువర్ణకంబుల ప్రాయికంబుగా నగు.

(వచి + అర్థ) వచించు అను నర్థముగల ధాతువులకు సంబంధించిన అముఖ్య కర్మమునకు తోడ, కు అను ప్రత్యయములు తఱుచుగా వచ్చునని భావము.

ఉదా:— చైత్రుఁడు మైత్రునితోడ నిట్లనియె (తోడ)

చైత్రుఁడు మైత్రున కిట్లనియె (కు)

ఇచ్చట 'ను' అనిద్వితీయము రావచ్చును.

7. సూ:- ఉపయోగంబునం దాఖ్యాతకుం దోడ వర్ణకం బగు.

ఉపయోగము=నియము పూర్వక విద్యాభ్యాసము.

ఆఖ్యాత=చెప్పువాఁడు (గురువు)

ఉదా:— రామకృష్ణులు సాందీపునితోఁడ వేదంబులం జదివిరి.

పై యుదాహరణమున సాందీపుఁడు ఆఖ్యాత యగుచున్నాఁడు. కాన అతనిని బోధించుపదమునకు 'తోడ' అను ప్రత్యయము వచ్చినది. సాందీపుని వలన అని యుండవలయును.

8. సూ:— సంప్రదానంబునఁ జతుర్థియగు.

ఉదా:— జనకుండు రాముని కొఱకుఁ గన్య నిచ్చెను:

త్యాగోద్దేశ్యము సంప్రదానము. ఎవని కొఱకు దానమీయఁబడినదో అతఁడు సంప్రదాన మగును. ఆసంప్రదానమును బోధించు పదమునకు చతుర్థీ విభక్తి ప్రత్యయమగు ఉన (కొఱకు) అను ప్రత్యయమువచ్చును. ఒక్కొకచో త్యాగము లేకున్నను ఉద్దేశమాత్రమునకుఁ గూడ చతుర్థీ వచ్చును.

ఉదా:— పురుషార్థము కొఱకు యత్నింప వలయును.

ఇట్టి యుదాహరణములయందు చతుర్థికంటె షష్టికే ఎక్కువ ప్రయోగములు కానవచ్చుచున్నవి.

ఉదా:— జనకుఁడు రామునకుఁ గన్యనిచ్చెను.
పురుషార్థంబునకు యత్నింప వలయును.

9. సూ:- అపాయ భయ జుగుప్సా పరాజయ ప్రమాద గ్రహణ భవన త్రాణ విరామ అంతర్ధి వారణంబు లెద్దాన నగు దానికి వలన వర్ణకం బగు, అపాయమనఁగా విశ్లేషము (ఎడబాటు)

ఉదా:- మైత్రుండు రాజ్యంబువలన భ్రష్టుం డయ్యె.
చోరుని వలన భయపడియె (భయము)
పాపంబువలన నేవగించె (జుగుప్స = అసహ్యము)
అధ్యయనము వలన దస్సె (పరాజయము)
పాడివలనం బరాకు వడియె (ప్రమాదము)
మైత్రునివలన ధనముఁ గొనియె (గ్రహణము)
మనువు వలనఁ బ్రజలు పుట్టిరి (భవనము=పుట్టుట)
చోరుని వలనఁ గాచె (త్రాణము=కాపాడుట)
భోగంబుల వలన విరమించె (విరామము=విరమించుట)
కృష్ణుండు తల్లివలన దాగె (అంతర్ధి=దాగుకొనుట)
శోకంబు వలన వారించె (వారణము=వారించుట)

10. సూ:— ఉండిపదం బొకానొకచో వలన వర్ణకంబున కను ప్రయుక్తం బగు.

ఉదా:- హిమగిరి వలననుండి గంగ పొడమె.

నాకంబు వలననుండి నారదుండు వచ్చె

ఇచట వలన ప్రత్యయమునకు 'ఉండి' అనుపదము అనుప్రయుక్తమయినది.

11.సూ:- ఉండి పదంబు పరం బగునపుడు వలనకు ద్వితీయా సప్తములు ప్రాయికంబుగా నగు.

ఉదా:- వనమునుండి వచ్చె. (ద్వితీయా)

వనమునందుడి వచ్చె (సప్తమి)

ఊరినుండివచ్చె (ద్వితీయా)

ఊరనుండివచ్చె (సప్తమి)

'ఉండి' అనుపదమునకు బదులుగా 'ఉంచి' అనుపదమును ఉపయోగింపరాదు.

12. :- కంటెవర్గం బన్యార్థాది యోగజం బగు పంచమి కగు.
అన్యార్థ + అదులు=అన్యార్థము మొదలగునవి:-అన్యము. ఇతరము, పూర్వము, పరము, ఉత్తరము మొదలగునవి.

పైన చెప్పిన పదములతో సంబంధముగల పంచమికి 'కంటె' అను ప్రత్యయము వచ్చును.

ఉదా:— రాముకంటె నన్యుండు ధానుష్కుండు లేఁడు.

లోభంబుకంటె నితరంబు దోషంబు లేదు.

ఇట్టి చోట షష్ఠియు వచ్చును.

ఉదా:- రాముని కన్యుండు ధానుష్కుండు లేఁడు.

13. సూ :— కంటె వర్ణకంబు నిర్ధారణపంచమి కగు.

ఒకజాతినుండి మఱియొక జాతిగాని, ఒకగుణమునుండి మఱియొక గుణముగాని, ఒకక్రియనుండి మఱియొక క్రియగాని వేఱు చేయఁబడునప్పుడు 'కంటె' అను ప్రత్యయము వచ్చునని భావము.

ఉదా :— మానహాని కంటె మరణము మేలు.

ఇచట మానహానియను క్రియానామవాచకము నుండి మరణము అను క్రియ వేఱుచేయఁబడినది, కావున దానికి 'కంటె' అను ప్రత్యయము వచ్చినది.

14. సూ :- పట్టి వర్ణకంబు హేతువులగు గుణ క్రియలకగు.

హేతువులైన గుణవాచక శబ్దములకును, క్రియవాచక శబ్దములకును 'పట్టి' యను ప్రత్యయము వచ్చును.

ఉదా :— జ్ఞానముంబట్టి ముక్తుఁడగును.

15. సూ :- శేషషష్ఠికి యొక్కయునగు. శేషషష్ఠి=సంబంధమును దెలుపు షష్ఠి, ఇట్టి షష్ఠికి 'యొక్క' అను ప్రత్యయము వచ్చును. ఈ యర్థమున 'కు' అను ప్రత్యయము గూడ రావచ్చును.

ఉదా :- నాయొక్క మిత్రుఁడు, వానియొక్కసోదరుఁడు(యొక్క)
నాకుఁ దమ్ముఁడు, నీకు సోదరుఁడు (కున్)

16, సూ :- నిర్ధారణ షష్టికి లోపలవర్ణకంబగు. నిర్ధారణమనఁగా జాతినిబట్టిగాని, గుణమును బట్టిగాని, క్రియనుబట్టిగాని సమూహము నుండి విడఁ దీయుట. ఆ సమూహమును బోధించు శబ్దమునకు

'లోపల' అను ప్రత్యయము వచ్చునని భావము. దీనికి బదులుగా 'అందు' అను ప్రత్యయము గూడ రావచ్చును.

ఉదా :- మనుష్యుల లోపల క్షత్రియుండు శూరుండు (మనుష్యుల యందు)

గోవుల లోపలఁ గపిల బహుక్షీర (గోవులయందు)

అధ్వగుల లోపలఁ బాఱువాఁడు శీఘ్రగామి (అధ్వగుల యందు)

ఛాత్రుల లోపల మైత్రుండు సమర్థుడు (ఛాత్రులయందు)

17. సూ :- అధికరణంబునకు సప్తమి యగు అధికరణము = ఆధారము. అట్టి యాధారమును బోధించు పదమునకు సప్తమీ విభక్తి వచ్చును. (అనఁగా 'అందు' అను ప్రత్యయము వచ్చునని భావము) ఈ యాధారము మూఁడు విధములు.

1. ఔపశ్లేషికము=సన్నిహితమయిన కలయిక గలది.
2. వైషయికము=విషయసంబంధమయినది.
3. అభివ్యాపకము=అంతటను వ్యాపించి యుండునది.

ఉదా :- ఘటంబున జలం బున్నది (ఔపశ్లేషికము)

మోక్షమునం దిచ్ఛ గలదు (వైషయికము)

అన్నిటియం దీశ్వరుఁడు గలఁడు (అభివ్యాపకము)

18. సూ :- ఉకారాంత జడంబునకు నవర్ణకం బగు. జడము= అచేతనము. దానికి 'న' అను ప్రత్యయము వచ్చును.

ఉదా :-ఘటంబున జలం బున్నది.

19. సూ :— విశేష్యమునకుంబోలె విశేషణంబునకు లింగ వచన విభక్తు లగు. విశేష్యము=నామవాచకము. నామవాచకము ఏలింగ వచన విభక్తులలో నుండునో విశేషణంబులుఁగూడ ఆలింగ వచన విభక్తులలోనే యుండునని భావము.

ఉదా:— నందతనయుండు కృష్ణుండు నాకు దిక్కు.

దేవకీ పుత్రు హరిని నుతింతు నెపుడు.

శుభ విధాయుల రామకృష్ణుల భజింతు.

భువనవంద్యను రుక్మిణిఁ బొగడుచుందు.

20. సూ :— స్త్రీ సమంబులగు విశేషణంబులయు, మువర్ణకాంత విశేషంబులయు బహువచనంబున కేకవచనంబు బహుళంబుగా నగు స్త్రీసమములు=ప్రథమైక వచన విభక్తులు లోపించిన పదములు (పెక్కు) మువర్ణకాంత విశేషణములు = ము అను ప్రత్యయము చివరఁగల విశేషణములు.

ఉదా:— మాటలు పెక్కేల, మాటలు పెక్కులేల (కుంఠితములు)

కులిశ ధారలు కుంఠితంబయ్యె, కులిశధారలు కుంఠితంబులయ్యె

ఇష్టమగు పదార్థములు, ఇష్టములగు పదార్థములు.

21. సూ:— ఒకానొకచో నొక విభక్తికి మఱియొక విభక్తియు నగు.

ఉదా:— మైత్రుంతు గృహము వెడలెను (గృహమునుండి వెడలెను)

వాఁడు వాహనమును దిగెను (వాహనమునుండి)

వారు సుఖమున్నారు (సుఖముతో నున్నారు)

22. సూ :- జడంబు తృతీయా సప్తములకు ద్వితీయ బహువచనంబుగానగు.

ఉదా:- మీనంబు జలంబులనుండు (జలంబునందు)
పంకం గలకలంబు పుట్టె (లంకయందు)
అర్జునుండు శత్రుసేనలను బాణంబులను రూపుమాపె.
రాముఁడు వాలినొక్కకోలం గూలనేసె (బాణములచే)

23. సూ – ఉపంత జడంబు తృతీయకు సవర్ణకం బగు.

ఉదా:– రాముఁ డొక్కబాణంబున వాలిం గూలనేసె.

24. సూ:– జడంబు ద్వితీయకుం బ్రథమ బహువచనంబుగా నగు.

ఉదా – వాఁడు పూవులు దెచ్చె—వాఁడు పూవులను దెచ్చె
ఆమె సొమ్ములు దాల్చె — ఆమె సొమ్ములను దాల్చె
వాఁ డిల్లు వెడలె—వాఁ డింటిని వెడలె.

25. సూ:– కాల అధ్వములకుం బ్రాయికంబుగాఁ బ్రథమ యగు.

ఉదా:– వాఁడు నిన్న వచ్చె (కాలము)
మాపు నిలువుము ( ,, )
రేవు పొమ్ము ( ,, )
వారు క్రోశము నడిచిరి (అధ్వము=మార్గము)
పీ రామడ వోయిరి ( ,, )

26. సూ :– సర్వనామ, సంఖ్యాభిధాన. తద్విశేష్యంబులయం దెయ్యది ముందుఁ బ్రయోగింపఁబడు దాని ద్వితీయాదులకుం బ్రథమ బహువచనంబుగా నగు.

సర్వనామములును, వానికి సంబంధించిన నామవాచకములను, సంఖ్యావాచకములును, వానికి సంబంధించిన నామవాచకము లును ఉపయోగింపఁ బడునప్పుడు అ జంటలలో నే పదము ముందు ప్రయోగింపఁబడునో దానికి ప్రథమ బహుళముగా వచ్చునని భావము.

ఉదా:- అన్ని గుఱ్ఱములకు, గుఱ్ఱము లన్నింటికి.
రెండు గుఱ్ఱములకు, గుఱ్ఱములు రెండింటికి.
లక్ష గుఱ్ఱములకు, గుఱ్ఱములు లక్షకు.

27. సూ:- ఒకానొకచో విశేషణంబుల షష్ఠికి ప్రథమ విభాష నగు.

ఉదా:- సుగుణాభిరాముఁడు రామునకు జోహారు నొనర్తు.

38. సూ:- భవత్యర్థ వ్యవహితంబులగు విశేషణంబులకుం బ్రథమ యగు.

'అగు' అనుపదము విశేషణములకును. వాని నామవాచకము నకును మధ్య నున్నచో ఆవిశేషణములకు ప్రథమా విభక్తి వచ్చునని భావము.

ఉదా:- విద్యాశాలియిగు పురుషుని సకలజనులు సన్మానింతురు
భూతదయాపరగు మహాత్ములకు శ్రేయంబు గలుగు
అతిమానుష మత్యద్భుత మతిదుష్కరమయిన కేశవార్జున కృతిన్.

**29. సూ:-** భవత్యర్థకంబు సన్నిహిత విశేషణంబునకును. దాని ముందు విశేషణంబులకు 'అయి'పదంబును బహుళంబుగా నను ప్రయుక్తం

బగు, చాల విశేషణములున్నపుడు నామవాచకమునకు దగ్గరలోనున్న విశేషణమునకు చివర 'ఔ, అగు, అవు' అను భవత్యర్థిక పదములును, దానికి ముందున్న విశేషణములకు చివర అయి, అను పదమును అనుప్రయుక్త మగునని భావము.

ఉదా:- అతులుఁడయి అప్రమేయుఁడౌ హరిని గొలుతు.

20. సూ:— అయి పదానుప్రయోగంబు లేనిచో తుది విశేషణంబున కేని విశేషణంబుల కన్నింటికేని మీఁద సముచ్చ యార్థంబు విభాషం బ్రయోగింపంబడు.

'అయి' అను పదము ఉపయోగింపఁ బడని పక్షమున చిట్ట చివరి విశేషణమునకుఁ గాని, అన్ని విశేషణములకుఁ గాని చివర 'ను' అను అక్షరము వికల్పముగా నుపయోగింపఁబడు నని భావము.

ఉదా:- ఆద్యుఁ డప్రమేయుఁడు నౌ హరిని గొలుతు.
ఆద్యుఁడు నమేయ గుణుఁడు నౌ హరిని గొలుతు.
ఆద్యుఁడుప్రమేయుండగు హరిని గొలుతు (ఇందు వికల్పముగాన 'ను' గూడ ఉపయోంపఁ వచ్చును)

31. సూ:- ధాతుజ విశేషణ వ్యవధానంబున విశేషణంబు లన్నింటికి 'అయి' పదం బనుప్రయుక్తం బగు.

'ఎసంగెడు, ఒప్పెడు, చెలఁగెడు' మొదలగు ధాతుజ విశేషణములు విశేషణములకును వాని నామ వాచకమునకును మధ్య నున్నచో దాని ముందున్న విశేషణముల కన్నింటికిని చివర 'అయి' అనుపదము అనుప్రయుక్త మగును.

ఉదా:— ఆద్యుఁడఱు యప్రమేయుఁడై, యఖిలసేవ్యుఁడై యెసం గెడు దేవుని నభినుతింతు.

32. సూ:— భావార్థంబది యోగంబుసం గర్తృకుం బ్రథమ యగు.

ఉదా:— రాముఁడు వచ్చుట (ఇచ్చట 'ట' అను ప్రత్యయము భావార్థకము).

రాముఁడు రాగా లక్ష్మణుఁడు గాంచె.

రాముఁడు విల్లందినం ద్రిలోకంబు లాకులంబు లగు,

రాముడు పట్టిన ప్రతిన వారింపం దరంబుగాదు.

33. సూ:— ప్రథమాంతంబులగు యుష్మ దస్మ ద్విశేషణంబుల కేకత్వంబున 'వు, ను' లును, బహుత్వంబున 'రు, ము' లును అంతాగమంబులు ప్రాయికంబుగా నగు.

ఈ యాగమంబు. పరంబగు నపుడు ఉత్వంబున కత్వంబగు, ప్రథమాంతములయిన 'నీ, నా' శబ్దములను విశేషణములకు ఎకవచనమున 'వును' లును బహు వచనమున 'రు. ము' లును ఆగమములుగా వచ్చి చేరును. అవి చేరినపుడు వానికి ముందున్న ఉకారము అకారముగా మారునని భావము.

ఉదా:— నీవు ధన్యుఁడవు (ధన్యుఁడు—ధన్యుఁడవు)

నేను ధన్యుఁడను (ధన్యుఁడు-ధన్యుఁడను)

మీరు ధన్యులరు (ధన్యులు—ధన్యులరు)

మేము ధన్యులము (ధన్యులు—ధన్యులము)

34. సూ:- అది యను శబ్దమున౯ వునులు పరంబు లగునప్పుడును, సంబోధనంబునందును దాన యనునది యాదేశంబగు

ఉదా:- నీవు చిన్నదానవు (చిన్న + అది = చిన్న దానవు)
నేను చిన్నదానను (చిన్న + అది = చిన్నదానను)
ఓ చిన్నదాన (చిన్న + అది = చిన్నదానా!)

35. సూ:- అన్య దుష్మ దస్మత్కార్యంబులం దుత్తరోత్తరంబు బలీయంబు.

ప్రథమ పురుషము, మధ్యమ పురుషము, ఉత్తమ పురుషము అను వానికి ఒకే వాక్యమున కలయిక జరిగినచో మొదటి దానికన్న రెండవదియు, రెండవదాని కన్న మూఁడవదియు బలవంత మగును. అనఁగా క్రియ దానితో నన్వయించునని భావము.

ఉదా:- వారును మీరును ధన్యులరు (ఇట మధ్యమ పురుషము బలీయము)
మీరును మేమును ధన్యులము (ఇట ఉత్తమ పురుషము బలీయము)

36. సూ:- ఏక వాక్యంబునం దొకానొకండు దక్క సర్వపదంబులును క్రమ నిరపేక్షంబుగం బ్రయోగింపంబడును.

ఎక్కడనైన నొకపదము తప్ప సాధారణముగా పదములన్నియు వాక్యమున క్రమ పద్ధతి యవసరము లేకయే ప్రయోగింపఁబడ వచ్చును.

ఉదా.— గాలి చల్లగా వీచెను.
వీచెను గాలి చల్లగా.
చల్లగా గాలి వీచెను.
వీచెను చల్లగా గాలి.
గాలి వీచెను చల్లగా.
చల్లగా వీచెను గాలి.

# 6. ఛందస్సు

కవి యొక్క విశిష్టమయిన భావమును కవిత్వ మందురు. అట్టి కవిత్వము గద్య కవిత్వమనియు, పద్య కవిత్వ మనియు రెండు విధములుగ నుండును. వానిలో గద్య కవిత్వమునకు వ్యాకరణ నియమము మాత్రమే యుండును. ఛందో నియమము ఉండదు. పద్య కవిత్వమునకు వ్యాకరణ నియమమును, ఛందో నియమముగూడ ఉండును. పద్య కవిత్వము యొక్క లక్షణమును చెప్పు శాస్త్రమునే ఛంద శ్శాస్త్రమందురు. దీనినే క్లుప్తముగా ఛందస్సు అని వ్యవహరింతురు.

ఛందస్సులో అనేక విధములయిన పద్యములు చెప్పఁబడును గాన కవితా రీతుల నెల్ల గుర్తించుటకీ శాస్త్రము తప్పక యభ్యసింప దగి యుండును. ఏది యేపద్యమో తెలుసు కొనుట ఈ ఛంద శ్శాస్త్రము వలననే జరుగును. ప్రతి పద్యము నందును కొన్ని పదము లుండును ప్రతి పదము నందును కొన్ని గణములుండును, ప్రతి గణము నందును కొన్ని యక్షరములుండును. అక్షరములను అచ్చులు, హల్లులు అను విభేదములతోనే గాక, గురువులు, లఘువులు అను భేదముతోఁగూడ విడఁదీయుదురు,

ఒక పద్యమును ఫలానా పద్యమని గుర్తించుటకు అందలి (1) గణములు, (2) యతిస్థానము, (3) ప్రాస అను మూఁడంశములను తెలిసికొని యుండవలెను. గణముల స్వరూపము తెలియవలె నన్నచో

ముందు గురువు అన నేమియో, లఘువు అననేమియో, గణములన నెట్టివియో అవి యెట్లేర్పడునో తెలిసికొనవలయును.

## గురువులు

1. దీర్ఘాక్షరము లన్నియు గురువులే యగును, (గురువునకు గుర్తు U)

ఉదా:– ఆ, ఈ, ఊ, ఋా, ఏ, ఐ, ఓ, ఔ, కా, కీ. మొదలగునవి

2. సంయుక్తాక్షరములకును, ద్విత్వాక్షరములకును వెనుక నున్న అక్షరములు గురువులు.

ఉదా :– రక్తము (ఇందు 'క్త' సంయుక్తాక్షరము గాన దానికి వెనుక నున్న 'ర' అను అక్షరము గురువు. 'క్త'అనునది తనంతట తాను గురువుకాదు).

ఉదా :– అక్కరము (ఇందు 'క్క' అనునది ద్విత్వాక్షరముగాన దానికి వెనుకనున్న 'అ' అను నక్షరము గురువు 'క్క' అనునది తనంతట తాను గురువుకాదు.

3. సున్న తోడను, విసర్గముతోడను. పొల్లక్షరము తోడను కూడియున్న అక్షరములు గురువులు.

ఉదా :– 'అంశము' (ఈపదములోని 'అ' అను నక్షరము సున్నతోఁగూడి యున్నదిగాన గురువు).

ఉదా :– దుఃఖము (ఈ పదములోని 'దు' అను నక్షరము విసర్గముతోఁ గూడియున్నదిగాన గురువు.

ఉదా :— 'వనముల్' (ఈ పదములోని 'ము' అను నక్షరము
లకారపు పొల్లుతో కూడియున్నది గాన గురువు.

→సున్నగాని, విసర్గముగాని, పొల్లక్షరముగాని ప్రత్యేకాక్షర
ములుగా లెక్కింపఁబడవు.

## లఘువులు (లఘువునకు గురు I)

గురువులుకాని యక్షరము లన్నియు లఘువులే యగును.

ఉదా :— అ, ఇ, ఉ, ఋ, ఎ, ఒ, క, కి, కు, కృ, కె, కొ ॥మొ॥
పైన జెప్పబడిన గురువులును లఘువులును కలిసి
గణము లేర్పడును.

## గణములు

సాధారణముగా మూఁడక్షరములు కలిసి యొక గణ మగును.
వానిలో ఎన్ని గురువు లుండవలయును, ఎన్ని లఘువుండవలయును
అనునది ఆయా గణముల యొక్క లక్షణముపై నాధారపడి యుండును.
కొన్ని ముఖ్యములయిన గణములు. వీనిని అక్షరగణములందురు. అనఁగా
అక్షరసంఖ్యలో చెప్పఁబడు గణములన్నమాట. ఈ గణములు ముఖ్య
ముగా ఎనిమిది కలవు. వాని పేర్లు అక్షరములతో చెప్పఁబడును.

మ, భ, జ, స, న, య, ర, త.

పైన వ్రాసిన యొక్కొక్క యక్షరము ఒకొక్క గణమునకు
పేరన్నమాట. అనఁగా మగణము, భగణము, జగణము, సగణము,

యగణము. రగణము, తగణము, అని వ్యవహరింతురన్న మాట, వాని యుపయోగ మీ క్రింది విధముగా నుండును.

| | | | | |
|---|---|---|---|---|
| 1. | మగణము | UUU | శ్రీరామా | (మూఁడును గురువులు) |
| 2. | భగణము | UII | రాముఁడు | (మొదటి గురువు) |
| 3. | జగణము | IUI | అనంగ | (మధ్య గురువు) |
| 4. | సగణము | IIU | వినలే | (చివర గురువు) |
| 5. | నగణము | III | అనఁగ | (మూఁడును లఘువులు) |
| 6. | యగణము | IUU | అనంగదే | (మొదటిలఘువు) |
| 7. | రగణము | UIU | అయ్యోడన్ | (మధ్య లఘువు) |
| 8. | తగణము | UUI | నీయందు | (చివర లఘువు) |

పై 8 గణములేగాక రెండక్షరములుగల రెండు గణములుగలవు.

వానిలో మొదటి దానిని 'గలము' అని గాని, 'హగణము' అని గాని యందురు.

రెండవ దానిని 'లగము' లేక వగణము' అనిగాని యందురు. వాని స్వరూపము ఇట్లుండును.

గలము,హగణము. UI రామ (మొదటి గురువు, తరువాతలఘువు)

లగము, వగణము. IU హరీ (మొదటిలఘువు,తరువాతగురువు)

ఇంకను ఒక్క గురువు ప్రత్యేకముగా నుపయోగింపవలసి వచ్చినచో దానిని గ, అనియు, ఒక్కలఘువును ప్రత్యేకముగ నుపయోగింపవలసి వచ్చినచో, దానిని 'ల' అనియు వ్యవహరింతురు.

ఇంకను, 'గగము' అన్నను, 'గా' అన్నను రెండు గురువులని యర్థము.

## యతులు

పాదమునందలి మొదటి యక్షరమును యతి యందురు. పద్య లక్షణమును బట్టి ప్రతి పద్యమునకును యతిస్థానము మాఱుచుండును పాదమునందలి మొదటి యక్షరము యతికాఁగా ఆ పాదమునందలి పద అక్షరముగాని పదునొకండవ అక్షరముగాని పండ్రెండవ అక్షరము గా ఇట్లే ఏడియో యొకసంఖ్య గల అక్షరము యొక్క స్థానము యతి స్థా మగుచుండును. కావున పాదముయొక్క మొదటి యక్షరమునకును య స్థానమునందలి యక్షరమునకును సంబంధముండును. ఏయే అక్షరము కట్టి సంబంధముగలదో వానినే యతి నిబంధన లందురు. ఇవి విధములుగా నున్నవి, వానిలో కొన్ని యిచట చెప్పఁబడు చున్నవి.

## అజ్యయతులు (అచ్ యతులు)

అ ఆ ఐ ఔ

ఇ ఈ ఋ ౠ ఎ ఏ

ఉ ఊ ఒ ఓ

పై మూఁడు వరుసలలోని యక్షరములును ఏ వరుసలోని అక్షర ములు ఆ వరుసలోని అక్షరములతోనే యతి మైత్రి కలిగి యుండును.

మొదటి వరుసలోని యే యక్షరముతో పాదము ప్రారంభించినను యతి స్థానమునందు ఆ వరుసలోని యక్షరమునే వాడవలయును, కాని

ఇంకొక వరుసలోని యక్షరమును వాడరాదు. అట్లు వాడినచో యతి తప్పినదందురు. ఆపద్యమును పద్యముగాఁ బరిగణింపరు.

ఉదా :- అవునవు నందినన్ సికయు నందకయున్నను గాళ్ళు పట్టుకొం.

పై పద్య పాదములో మొదటియక్షరము 'అ' అనునది. 'చంపకమాల' యను పద్యపాదము చంపకమాల యందు 11 వ యక్షరము యతి స్థానము. కావున పై పద్యపాదములోని 11 వ యక్షరముగా 'అ' అనునది యుపయోగింపఁబడినది. అనఁగా ఆ అను నక్షరమునకు అ అను అక్షరమే యతిస్థానమున ఉపయోగింపఁబడినదన్న మాట. ఇట్లే ఇకారముతో పద్య పాదము నారంభించినచో యతి స్థానమున రెండవ వరుసలోని అ అక్షరములలో దేని నైనను యతిస్థానమున నుపయోగించికొనవచ్చును. అట్లే మూఁడవ వరుసలోని యక్షరములలో దేనితో పాదము నారంభించినను యతి స్థానమున అ వరుసలోని యక్షరమేదైన తప్పక రావలయును. ఇట్లు ఉపయోగించు దానినే యతియందురు. యతి నుపయోగించునప్పుడు ఏ పాదమును కాపాదమునకే సంబంధము గాని, తక్కినపాదములతో దానికి సంబంధములేదు. యతి స్థానమున సంధి యున్నచో ఆ సంధిని విడఁదీసి అవతలి యక్షరమునే యతితో సంబంధింపఁ జేయవలయును. పై యుదాహరణమున యతి స్థానమున 'న' అని యున్నది. అందలి నకారపు పొల్లు 'సికయున్' అను పదములోనిది. కావున దానిని విడఁగొట్టి 'ఆందక' అనుపదము మొదటి అచ్చయిన 'అ' అను దానితో యతిని సంబంధింపఁజేయుట జరిగినది. ఒక ప్రత్యేకముగా జెప్పఁబడు యతితో తప్ప ఏ చోటునందును మొదటి యక్షరముతో యతి సంబంధింపదు.

## 2. హల్యతులు

1. వర్గయతి

క ఖ గ ఘ

చ ఛ జ ఝ

ట ఠ డ ఢ

త థ ద ధ

ప ఫ బ భ

పై అయిదును వర్గములు. ఒక్కొక్క వర్గములో 5 అక్షరము లుండును. కాని వానిలోని 5వ యక్షరములు తొలగించి వ్రాయఁబడినవి పైన వ్రాసిన విధముగా 5 వరుసలలోని యక్షరములును ఏ వరుసలోని యక్షరములకు ఆ వరుసలోని యక్షరములతోడనే యతి చెల్లును. కవర్గములోని నాలుగక్షరములును వానితో వానికే యతి సంబంధముం డును గాని ఇతరములైన చవర్గము మొదలైన వానితో యతి సంబంధము ఉండదన్నమాట. ఇంకొకమాట బాగుగా గుర్తించుకొనవలెను. యతులుగా నుపయోగింపఁబడు హల్లులన్నియు ఏదో యొక అచ్చుతోఁ గూడియే యుండును. కావున పాదము మొదట హల్లుపయోగించిన యతి స్థాన మున దానికి సంబంధించిన హల్లును సరిపెట్టుటయేగాక పాదము మొదట నున్న హల్లుతోఁ గూడియున్న అచ్చును, యతిస్థానమందున్న హల్లుతోఁ గూడియున్న అచ్చునుగూడ అజ్యతుల వరుసననుసరించి సరిపడుచుండ వలయును. అనగా 'క' అను దానితో 'క కా కై కౌ' అను పద్ధతిగా అచ్చులుగూడ సంబంధము గలవి మాత్రమే వానితోగూడ నుండవలె యును.

ఉదా:— 'కాదన కిట్టిపాటి యపకారను తక్షకుఁడేక విప్రసం' పై యుదాహరణమున 'కా' అనునది యత్యక్షరము. పై పద్యమున 10 వ యక్షరము యతిస్థానము. యతిస్థానమున 'కా' అను నక్షరమే యున్నది. కకారమునకు కకారమే యతి స్థానమున వచ్చుటయేకాక వానిపైనున్న అచ్చుగూడ ఆకారమే యుండుట గమనింపుఁడు. ఇట్లు యతుల విషయమున అచ్చులును హల్లులును సరిపడుచుండవలయునని యెఱుంగునది.

## 3. సంయుక్తాక్షరయతి

రెండుమూడు హల్లులు కలసియున్న యక్షరముతో బాదము ప్రారంభించినను, యతిస్థానమున నుపయోగించినను, యతిస్థానమున గాని, పాదము మొదటగాని ఆ రెండుమూఁడు హల్లులలో నేదియో యొక హల్లునకు సంబంధించిన హల్లు నుపయోగించిన చాలును. దానినే సంయుక్తాక్షరయతి యందురు.

ఉదా:— 'గ్రీష్మాదిత్య పటుప్రతాప విసరాకీర్ణంబు శస్త్రాస్త్రజా' పై పద్య పాదమునందలి మొదటి 'గ్రీ' అనునది సంయుక్తాక్షరము. దానియందు గకారమును, రేఫమును కలిసియున్నవి. యతిస్థానమున 'కీ' అను అక్షరము మాత్రమే వాడఁబడినది. అనఁగా పాదము మొదటనున్న అక్షరములోని గకార రేఫములలోనుండు గకారమును మాత్రమే గ్రహించి యతి విషయమున రేఫము విడవఁబడినది. సంయుక్తాక్షర యతి యిట్లుండును. ఇట్లే ద్విత్వాక్షరము యతిస్థానమున నున్నను యతివిషయమున అట్టి ఒక హల్లును మాత్రమే వాడిన చాలును.

## 4. సరసయతి

అ, య, హ

చ, ఛ, జ, ఝ, శ, ష, స

ఽ, ణ.

పై వరుసలలోని యక్షరములు ఏవరుస కావరుసతో ఒకే సంబంధము కలిగియుండును. ఈయతియందు ఇంకొక విశేషము కలదు. మొదటి వరుసలోని అకారము అచ్చుగదా. ఆ అచ్చును య, హ అను హల్లుతో సంబంధింపఁ జేయుట యిందలి విచిత్రము. ఈ వైచిత్రిలో నుండి యింకొక వైచిత్రి బయటఁ బడుచున్నది. గమనింపుఁడు. ఇచ్చట అకారమునకు య, హలతో సంబంధము కలుపబడినది. కావున అకారముతో సంబంధముగల 'ఆ, ఐ, ఔ' అను అచ్చులుగూడ దానివెంట వచ్చును. కాన వాని సంబంధము మిక్కిలి విశాలమగుచున్నది. గమనింపుఁడు. ఈ క్రింది వరుసలలో నిన్ని యక్షరములు చేరును.

1 అ, ఆ, ఐ, ఔ, య, యా, యై, యౌ, హ, హా, హై, హౌ.

2. ఇ, ఈ, ఋ, ౠ, ఎ, ఏ, యి, యీ, యృ, యౄ, యె, యే, హి, హీ, హృ, హౄ, హె, హే.

3. ఉ, ఊ, ఒ, ఓ, యు, యూ, యొ, యో, హు, హూ, హొ, హో.

పై విధముగా వరుసలు విశాలమైన సంబంధమును పొందుచున్నవి. ఏవరుస కావరుసను స్వేచ్ఛగా యతి సంబంధము పొందునట్లు ఈ సరసయతి అవకాశమిచ్చి యున్నది.

మఱియు, 'చ, ఛ, జ, ఝ' అను చవర్గాక్షరములు 'శ, ష, స' అను మూడక్షరములతోను సంబంధమును పొందుట యికొంక విశేషము. ఇట్లింక నెన్నియో యతులు గలవు. శాస్త్రమును అభ్యసించిన కొలఁదియు అవి యన్నియు స్పష్టపడును.

## ప్రాసము

పాదముయొక్క రెండవ యక్షరమును ప్రాస మందురు. యతి యొక్కొక్క పాదమునకే సంబంధించి యుండఁగా ప్రాసము అన్ని పాదములకును సంబంధించి యుండును. మొదటి పాదములోని రెండవ యక్షరమునే తక్కినపాదములలోఁ గూడ రెండవ యక్షరమునుగా మప యోగింపవలయును. ప్రాసమునందు అచ్చుసరిపడవలసిన పనిలేదు. ఏ అచ్చునయిన స్వేచ్ఛగా నుపయోగింపవచ్చును. హల్లుమాత్రము మర్పు చెందుటకు వీలులేదు. అనఁగా మొదటి పాదముయొక్క రెండవ యక్ష రము చకారమైనచోఁ దక్కిన మూఁడు పాదములయందును చకారమే రెండవ యక్షరముగా నుండవలయును.

ఉదా:- "శ్రీరాముని దయచేతను
నారూఢిగ సకలజనులు నౌరాయనఁగా
ధారాళమైన నీతులు
నోరూరఁగ జవులుపుట్ట నుడివెద సుమతీ!"

పై పద్యములోని నాలుగు పాదములయందును రకారము ప్రాసాక్షరమగా నుంచఁబడినది. ఆ యక్షరమును తిలకింపుఁడు.

ఈ ప్రాసము సుకర ప్రాసమనియు, దుష్కర ప్రాసమనియు రెండు విధములు.

1. సుకర ప్రాసము:—

ఒకే హల్లును ప్రాసాక్షరముగా నుపయోగించినచో దానిని సుకర ప్రాస మందురు. పై నుదహరింపఁ బడిన పద్యమున రేఫము (రకారము) ఒకటే ప్రాసాక్షరముగాన నది సుకర ప్రాసామునకు ఉదాహరణము.

2. దుష్కర ప్రాసము:—

ప్రాసాక్షరము సంయుక్తాక్షరమైనను, ద్విత్వాక్షరమైనను, బిందు పూర్వకమైనను, విసర్గ పూర్వకమైనను దానిని దుష్కర ప్రాసమందురు.

ఉదా:— "విన్నంజాలు భవన్మహత్వము, భవద్విజ్ఞాన సద్గోష్ఠియం
దున్నం జాలు, భవత్పదాంబురుహ సేవోత్సాహ సంప
న్నులం
గన్నంజాలు, భవ త్సమంచిత జగత్కల్యాణ నామం
బుఁ బే
ర్కొన్నంజాలు, నరుండు శాశ్వత శుభారూఢుండు
లక్ష్మీశ్వరా!"

పై యుదాహరణములో ప్రాసాక్షరముగా ద్విత్వాక్షర ముపయో గింపఁబడినది. ఇది దుష్కర ప్రాసము. మఱియు నీ పద్యమున ఆకవి ప్రాసాక్షరమును ద్విత్వాక్షరమునుగా నడుపుటయే గాక దాని తరు వాత బిందు పూర్వకమయిన 'జాలు' అను పదమును గూడ ప్రాసగానే

నడిపినాఁడు. ఇట్లే విసర్గ పూర్వకమునకును, బిందు పూర్వకమునకు, సంయుక్తాక్షరమునకును నుదాహరణములను గ్రహింపుడు.

గణములను గుర్తించు తీరు.

మన కే గణము కావలసియున్నను ఆ గణ స్వరూపమును ఈక్రింది సూత్రమును బట్టి సులభముగా గుర్తింపవచ్చును.

యమాతా రాజభాన సలగొ.

యగణము కావలసియున్న యమాతా అని చూచికొనవలెను, మగణము కావలసియన్న మతారా అని చూచికొనవలెను. ఇట్లన్ని గణములను ఈ సూత్రము ద్వారా సాధించవచ్చును.

పద్య లక్షణము.

ఛదస్సులనునవి ఇరువదినాలుగు. ఉక్త, అత్యుక్త మొదలగునవి వాని పేర్లు. 19, 20, 21 సంఖ్యలుగల ఛంచస్సుల నుండి పుట్టిన పద్యములను నాల్గింటిని మనము తెలసికొందము ఎన్నవ ఛందస్సుతో పుట్టిన పద్య పాదమున అన్నియే అక్షరములుండును. అనఁగా 19వ ఛందస్సున పుట్టిన పద్య పాదమున 19 అక్షరములు ఉండునని భావము. ఇట్లే తక్కినవి గూడ గ్రహింప నగును.

**1. చంపకమాల;**

చంపకమాల పద్యములో ప్రతి పాదమందును 21 అక్షరములుండును. కావున నీ పద్యము 21వ ఛందస్సు నుండి పుట్టినదని గ్రహింప నగును, చంపకమాల పద్య లక్షణము:--

న, జ, భ, జ, జ, జ, ర

పైన చెప్పిన 7 గణములను వరుసగా నీ పద్య పాదమునందుండును. నాలుగు పాదములును సమాన లక్షణములే కలగియుండును.

ఈ పద్యమున ప్రతి పాదమునందును 11 వ యక్షరము యతిస్థాన మగును. 7 × 3=21 అక్షరములు, దీని లక్షణ పద్యము నీ క్రిందఁ జూడుఁడు.

చం॥ న జ భ జ జ ల్ జ రేఫలు పెనంగి దిశాయతి తోడఁ గూడినన్

ద్రిజగదభిస్తుతా! బుధనిధీ! విను చంపకమాలయై చనున్

పై పద్యము వేములవాడ భీమకవి రచించినది. సగము పద్యము లోనే చంపకమాల పద్య లక్షణము చెప్పఁబడినది.

దిశాయతి=దిగ్యతి, దిక్కులు పది గావున 10 అక్షరము లయిన పిదప 11వ యక్షరము యతి స్థానము, పై పద్యములో గణములు, యతి స్థానము, పద్యము పేరు చెప్పఁబడినవి. తక్కిన పదము లన్నియు లక్షణమునకు సంబంధింపవు. లక్షణము చంపకమాలలోనే యున్నది

| | III | IUI | UII | IUI | IUI | IUI | UIU |
|---|---|---|---|---|---|---|---|
| ఉదా:-- | అమిత | పరాక్ర | మంబును | యరంబు | నులావు | నుగ్గలు | భేదరో |

1. III -- నగణము--అమిత — 7 గణములు
2. IUI-- జగణము -పరాక్ర — న జ భ జ జ జ ర
3. UII-- భగణము -మంబులను — అనునవి వరుసగా నున్నవి.
4. IUI-జగణము -రయంబు — 'య' అను 11వ
5. IUI-జగణము - నులావు — యక్షరము
6. IUI-జగణము - నుగల్గు — యతి స్థానమున
7. UIU-రగణము -భేదరో — వాడఁబడినది

## 2. ఉత్పలమాల:

భ, ర, న, భ, భ, ర, లగ

ఈ పద్య పాదములో మూఁడక్షరములు గల గణములు 6 ఉండును. 7 వది 'లగ' మను రెండక్షరముల గణ ముండును. ఇది 20వ ఛందస్సులో పుట్టినది. కాన దీని యందు 20 అక్షరములే యుండును. 7 $\times$ 3 = 18 + 2 = 20 అక్షరములు.

ఇందు 10వ యక్షరము యతిస్థానము.

లక్షణ పద్యము:-

"భానుసమాన విన్ భరన భార లగంబులఁగూడి విశ్రమ స్థానమునందుఁ బద్మజయుతంబుగ నుత్పలమాలయై చనున్"

భా=భభ

లగ=వగణము.

పద్మజయుత మనఁగా నవ బహ్మలు గలది అని యర్థము. 9 అక్షరములు గడచిన పిదప 10 వ యక్షరము యతి స్థానమని గ్రహింప నగును. ఒకే యక్షరము ఎక్కువ తక్కువలుగా నున్న పై రెండు పద్యములని చెప్పవచ్చును. ఈ ఛంపకమాల, ఉత్పలమాల పద్యములకు పరస్పర సంబంధము గూడ గలదు. పేర్లలోఁ గూడ 'మాల' అను పదము చివర వచ్చుచున్నది.

| | భ | ర | న | భ | భ |
|---|---|---|---|---|---|
| | UII | UIU | III | UII | UII |
| ఉదా:- | ఎండకు | వానకో | ర్చితన | యిల్లుప్ర | వాసపుఁ |

| ర | లగ |
| --- | --- |
| UIU | IU |
| జోటునా | కయా |

3. మత్తేభవిక్రీడితము:

స, భ, ర, న, మ, య, వ

ఈ పద్యములోఁ గూడ సంపూర్ణ గణములు 6. రెండక్షరముల గణము 1 కావున ఈ పద్య పాదమునఁ గూడ 20 అక్షరములే యుండును.

వగణము=లగము (IU) ఈ పద్యముద 14వ అక్షరము యతి స్థానము.

పద్య లక్షణము

మ॥ "స్మయదూరా! విలసత్త్రయోదశయతిన్ మత్తేభ విక్రీడితా
హ్వయ మయ్యెన్ సభరమ్ములున్ సమయివ వ్రాతమ్ములన్
గూడినన్".

త్రయోదశ=13. పదుమూడక్షరములు దాటిన పిదప 14వ యక్షరము యతిస్థానమని భావము.

| | స | భ | ర | న | మ |
| --- | --- | --- | --- | --- | --- |
| | IIU | UII | UIU | III | UUU |
| ఉదా:— | స్ఫురదా | త్మామజ | టాకలో | పముల | తోఁబూర్ణేం |

| య | వ |
|---|---|
| IUU | IU |
| దు సేంద | రస్యం |

## 4. శార్దూల విక్రీడితము :

మ, స, జ, స, త, త, గ

ఈ పద్యములో( గూడ సంపూర్ణ గణములు 6. 'గ' అనగా ఒకేగురువు. ప్రతిపాదమునందును ఉండును. $6 \times 3 = 18 + 1 = 19$. కావున నీ పద్యమునను 19 అక్షరములుండును. ప్రతి పాదములోను 13వ యక్షరము యతిస్థానము.

పద్యలక్షణము

సారాచార విశారదా! యినయతిన్ శార్దూల విక్రీడితా కారంబై మసజమ్ము లిమ్మగ సతాగ ప్రాప్తమై చెల్వగున్.

య = తత

గ = ఒకే గురువు

ఇనయతి=సూర్యయతి. ద్వాదశాదిత్యులు అను వ్యవహారమునుబట్టి సూర్యులు పండ్రెండుగురు. కాన పండ్రెండక్షరములు జరిగిన వెనుక 13వ యక్షరము యతిస్థానమని భావము.

| మ | స | జ | స | త |
|---|---|---|---|---|
| UUU | IIU | IUI | IIU | UUI |
| శా॥ విన్నజా | లుభవ | న్మహ | ముభవ | ద్విజ్ఞాన |

| త | గ |
|---|---|
| UUI | U |
| సద్గోష్ఠి | యం |

చంపకమాల, ఉత్పలమాల అను రెండు పద్యములును ఎట్లు జంటగా నున్నవో అట్లే మత్తేభ విక్రీడితము, శార్దూల విక్రీడితము అను రెండు పద్యములు గూడ జంట పద్యములని గ్రహింపనగును. చంపక మాలను ఉత్పలమాలలోనికి మార్చుట సాధ్యమగును. అది యెట్లనఁగా, చంపకమాల పద్యములోని మొదటి రెండు లఘువులను ఒక్క-గురువునుగా మార్చినచో అది ఉత్పలమాల యగును. అట్లే ఉత్పల మాల పద్యపాదములోని మొదటి గురువును రెండు లఘువులనుగా మార్చి నచో అది చంపకమాల యగును.

ఉదా :- అవునవు నందినన్ సికయు నందకయున్నను గాళ్ళు పట్టుకొం
ఔనవు నందినన్ సికయు నందకయున్నను గాళ్ళు పట్టుకొం.

పైనున్న మొదటి చంపకమాల పాదములోని 'అవు' అను అక్షరపు జంటను 'ఔ' అని మార్చుటచే ఉత్పలమాల పద్యపాదమయినది. ఇట్లే ఉత్పలమాల పద్యపాదములోని మొదటి గురువును. రెండు లఘువులుగా జేసి చంపకమాలగా మార్చవచ్చును. ఔ అను దానిని అవుగా మార్చుట యే దానికి మార్గము. ఇట్లే శార్దూల విక్రీడితమును మత్తేభ విక్రీడితములోనికిని మార్చవచ్చును. దానికిఁ గూడ మార్గ మిదియే. పైపద్యములను నాల్గింటిని చూచినవెంటనే గుర్తించుటకు సూక్ష్మ మార్గమొకటి గలదు. వీనిని కొండి గుర్తులందురు.

1. చంపకమాల :- IIII ఇట్లు నాలుగు లఘువులు పద్య పాదమునకు మొదట వరుసగా నుండి, పాదము మొత్తమునకు 21 అక్షర ములున్నచో దానిని చంపకమాల యని గుర్తింప వచ్చును.

2. ఉత్పలమాల :-UIIU ఇట్లు పాదమునకు మొదట గురువును

మధ్య రెండు లఘువులు, తరువాత నొక గురువును వరుసగా నుండి మొత్తము పాదమునందు 20 అక్షరము లున్నచో దానిని ఉత్పలమాల యనవచ్చును.

3. మత్తేభము :- IIU ఈ విధముగా రెండు లఘువులును తరువాత నొక గురువును పాదమునకు మొదటనుండి 20 అక్షరములు పాదము మొత్తమున నున్నచో దానిని మత్తేభ విక్రీడిత మనవచ్చును.

4. శార్దూలము :- UUU ఈ విధముగా మూఁడు గురువులు వరుసగా పాదమునకు మొదట నుండి పాదము మొత్తమున 19 అక్షరములున్నచో దానిని శార్దూల విక్రీడిత మనవచ్చును.

5. స్రగ్ధరావృత్తము :-

మ, ర, భ, న, య, య, య

స్రగ్ధరావృత్తము నందు పైన పేర్కొన్న 7 గణములును క్రమముగా నుండును. అనఁగా ఒక్కొక్క పాదమునకు 21 అక్షరములు ఉండునని భావము.

ఇందు ప్రతిపాదమునందును రెండేసియది స్థానములుండును. పాదముయొక్క మొదటి యక్షరముతో సంబంధముగల అక్షరములు రెండు స్థానములందును ఉండవలయును. యతిస్థానములు 8, 15 అక్షరస్థానము ఈ క్రింది యుదాహరణమును జూడుఁడు.

| | మ | ర | భ |
|---|---|---|---|
| | UUU | UIU | UII |
| ఉదా :- | శ్రీమమ్మా | ర్లీమకా | రాశ్రిత |

| న | య |
|---|---|
| III | IU |
| రభన | యయా |

| | య | య |
|---|---|---|
| U | IUU | IUU |
| సే | వ్యామైహ | నుమద్వి |

| మ | ర | |
|---|---|---|
| UUU | UIU | U |
| శ్రామంబై | సానుమ | ద్వి |

| భ | న | య |
|---|---|---|
| II | III | IUU |
| శ్రమ | మునమ | రంగా స్ర |

| య | య |
|---|---|
| IUU | IUU |
| గ్ధరావృ | త్తమయ్యెన్ |

పైన స్రగ్ధరావృత్తము యొక్క రెండు పాదము లీయఁబడినవి. యతిస్థానములు స్పష్టముగాఁ దెలియుటకై వేఱు వేఱు పంక్తులుగా విడగొట్టి చూప బడినవి. గణ విభజనము చేసియుఁ జూపఁబడినది.

6. మహాస్రగ్ధరావృత్తము :-

స, త, త, న, స, ర, ర, గ

ఈ మహా స్రగ్గరావృత్తము నందు పైన పేర్కొనిన 7 సంపూర్ణ గణములును తరువాత ఒక గురువును క్రమముగా నుండును.

అనఁగా ఒక్కొక్క పాదమునకు 22 అక్షరములు ఉండునని సారాంశము.

ఈ పద్యమున ప్రతి పాదమునందు స్రగ్ధరావృత్తమునందు వలెనే రెండేసి యతిస్థానములుండును. పాదముయొక్క మొదటి యక్షరముతో సంబంధముగల యక్షరము లా రెండు స్థానములందును ఉంచవలయును. యతిస్థానములు 9, 16 అక్షర స్థానములు. ఈక్రింది లక్షణ పద్యమునే యుదాహరణముగా గ్రహింపుడు, ఇచట రెండు పాదములు ఈయఁబడినవి.

ఉదా :—

| | | |
|---|---|---|
| స | త | త |
| IIU | UUI | UU |
| లసదు | ద్యత్కీర్తి | వల్లీ |

| | | |
|---|---|---|
| | న | స |
| I | III | IIU |
| ల | లితగు | ణగణా |

| | | |
|---|---|---|
| ర | ర | గ |
| UIU | UIU | U |
| లంకృతాం | గాసతా | న |

| | | |
|---|---|---|
| స | త | త |
| IIU | UUI | UU |
| స్థసరా | గంబుల్మ | హాస్ర |

| | న | స |
|---|---|---|
| I | III | IIU |
| గ్ధ | రకు వ | సుము ని |

| ర | ర | గ |
|---|---|---|
| UIU | UIU | U |
| స్గానవి | శ్రాంతినొ | బ్బన్ |

పైన మహాస్రగ్ధరా వృత్తముయొక్క పద్య పాదములు రెండు ఈయఁబడినవి. యతిస్థానములు స్పష్టముగా దెలియుటకై వేఱు వేఱు పంక్తులుగా విడఁగొట్టి చూపుచు వాని క్రింద గీట్లుంచఁబడినవి. గణ విభజనము చేసియు చూపఁబడినది.

7. మత్తకోకిలము :—

ర, స, జ, జ, భ, ర

ఈ పద్యమునందు 11వ యక్షరము యతి స్థానము.

పద్యలక్షణమే ఉదాహరణముగా నీయఁబడుచున్నది.

| | ర | స | జ | |
|---|---|---|---|---|
| | UIU | IIU | IUI | I |
| ఉదా :— | శ్రావకా | భరణాం | కవిన్ర | స |

| | | |
|---|---|---|
| జ | భ | ర |
| UI | U II | UIU |
| జాణ | రే ఫల | దిగ్వీరా |

| | | | |
|---|---|---|---|
| ర | స | జ | |
| UIU | IIU | IUI | I |
| మాపహాం | బుగము | త్రకోకి | ల |

| | | |
|---|---|---|
| జ | భ | ర |
| UI | UII | UIU |
| యండు | దినిఁగ | వీశ్వరుల్ |

8. తరల వృత్తము:—

న, భ, ర, స, జ, జ, గ,

ఈ పద్యమునందు 12 వ యక్షరము యతిస్థానము

| | | | |
|---|---|---|---|
| న | భ | ర | |
| III | UII | UIU | II |
| ఉదా:-ప్రవర | రుద్రపు | రామయు | క్రిన |

| | | | |
|---|---|---|---|
| స | జ | జ | గ |
| U | IUI | IUI | U |
| భం | బులున్ర | సజాగ | ముల్ |

| | | | |
|---|---|---|---|
| న | భ | ర | స |
| III | UII | IUI | II |
| కవిజ | నాశ్రయ | పోందియం | దము |

| | | | |
|---|---|---|---|
| | జ | జ | గ |
| U | IUI | IUI | U |
| గా | మహీంద | రలంబ | గున్ |

9. స్రగ్విణీ వృత్తము:-

ర, ర, ర, ర అను నాలుగు గణములు ప్రతిపాదమునందు నుండును.

ఈ వృత్తమునందు 7 వ యక్షరము యతిస్థానము.

లక్షణ పద్యమునందలి రెండు పాదములును ఉదాహరణలుగా నీయఁబడుచున్నది.

| | ర | ర |
|---|---|---|
| | UIU | UIU |
| ఉదా:- | వాగ్వధూ | వల్లభా |
| | ర | ర |
| | UIU | UIU |
| | వార్థిరే | పావలిన్ |
| | ర | ర |
| | UIU | UIU |
| | స్రగ్విణీ | వృత్తవి |
| | ర | ద |
| | UIU | UIU |
| | శ్రామముల్ | ధాత్రిపై |

10. మాలినీ వృత్తము:-

న, న, మ, య, య

ఈ పద్యమునందు యతి 9 వ అక్షరము,

| | న | న | మ |
|---|---|---|---|
| | III | III | UU |
| ఉదా :- | కరుణ | గలిగి | మమ్ముం |

| | య | య |
|---|---|---|
| U | IUU | IUU |
| గా | వుమయ్యా | మహేశా ! |

11. పంచ చామరము:-

జ, ర, జ, ర, జ, గ

ఇందు 10వ యక్షరము యతి స్థానము.

లక్షణ పద్యము తోడనే ఉదాహరణముగూడ చూపఁ బడు చున్నది.

| జ | ర | జ | ర | జ | గ |
|---|---|---|---|---|---|
| IUI | UIU | IUI | UIU | IUI | U |
| ఉదా:-జరత్ జ | రల్ జగం | బుఁగూడఁ | జాలిరే | చనావి | ధి |

| జ | ర | జ | ర |
|---|---|---|---|
| IUI | UIU | IUI | UIU |
| స్ఫురద్వి | రామమై | ధరిత్రిఁ | బొల్చుఁబం |

| జ | గ |
|---|---|
| IUI | U |
| చచామ | రం |

12. సుగంధి వృత్తము :-

ర, జ, ర, జ, ర, వ

ఇందు 11 వ యక్షరము యతిస్థానము.

లక్షణ పద్యమునే యుదాహరణముగా గూడ గ్రహించునది.

| | ర | జ | ర | జ | ర | వ |
|---|---|---|---|---|---|---|
| | UIU | IUI | UIU | IUI | UIU | IU |
| ఉదా :- | భాసురం | బుగార | జద్వయం | బుపైర | వంబుగూ | డఁగా |

| ర | జ | ర | జ | ర | వ |
|---|---|---|---|---|---|
| UIU | IUI | UIU | IUI | UIU | IU |
| నాసుగం | ధికిన్ది | శాపిరా | మమంచి | తంబగుం | ధరన్ |

రజద్వయము=రజ రజ

13. మానినీ వృత్తము :-

ఇందు 7 భగణములు వరుసగా వచ్చి ఆ పై ఒక గురువుండును.

దీనియందు 13వ యక్షరము యతిస్థానము.

లక్షణ పద్యమునే యుదాహరణముగా గూడ గ్రహింపనగును.

| | భ | భ | భ | భ |
|---|---|---|---|---|
| | UII | UII | UII | UII |
| ఉదా :- | కారక | ముల్క్రియ | గన్గొన | నేడుభ |

| | | | |
|---|---|---|---|
| భ | భ | భ | గ |
| UII | UII | UII | U |
| కారము | లోకగ్రగ | కారము | తో |
| భ | భ | భ | భ |
| UII | UII | UII | U |
| గౌరవ | మైచనఁ | గాయతి | పంక్రిటెఁ |
| భ | భ | భ | గ |
| UII | UII | UII | U |
| గల్గిన | మానిని | కామని | భా |

పూర్వము మాలినీ వృత్తము 10 వ వృత్తముగాఁ జెప్పబడినది. అది వేఱు, ఇది వేఱు. జాగ్రత్తగా గుర్తించి కొనవలెను.

14. కవిరాజ విరాజితము :-

ఇందు న, జ, జ, జ, జ, జ, జ, లగ (6 జగణములు)

దీనియందు 8, 14, 20 వ అక్షరములు యతిస్థానము. అనఁగా పాదము మొదటి యక్షరముతో సంబంధముగల అక్షరములు 8 వ స్థానమునను, 14 వ స్థానమునను, 20 వ స్థానమునను ప్రతిపాదములోను తప్పక రావలెనని యర్థము.

లక్షణ పద్యముతోడనే ఉదాహరణము చూపఁబడుచున్నది.

| | | | | |
|---|---|---|---|---|
| న | జ | జ | జ | జ |
| III | IUI | IUI | IUI | IUI |
| ఉదా :-క్రమము | ననొక్క | నకార | మునాలు | జకార |

| | జ | జ | లగ |
|---|---|---|---|
| | IUI | IUI | IU |
| | ములుంబ | రగంగ | వకా |

| న | జ | జ | జ |
|---|---|---|---|
| III | IUI | IUI | IUI |
| రమును | నొడంబ | డిరాఁగ | విరాజి |

| జ | జ | లగ |
|---|---|---|
| IUI | IUI | IU |
| తమౌన | దిరామ | నిభా |

పై యుదాహరణములో క్రింద గీట్లుంచిన యక్షరములు యతి స్థానములు.

15. లయగ్రాహి :—

ఇందు భ, జ, స, న, భ, జ, స, న, భ ,య అను 10 గణములు క్రమముగా నుండును. దీనియందు 9, 17, 27 అక్షరముల స్థానముల నాశ్రయించి ప్రాసయతి నడుపఁబడును.

ప్రాసయతి లక్షణము.

యతిస్థానమును తప్పించి దాని ప్రక్కనున్న యక్షరమును ప్రాసాక్షరముగా నుపయోగించినచో దాని ప్రాసయతి యందురు.
ఉదా :— నీదు మహిమను వర్ణింప నాదువశమె.

పై యుదాహరణమునందు మొదటి యక్షరము 'నీ', 'నా' అను నక్షరము యతి స్థానమునను న్నది. కాని ఆ యక్షరము యతిస్థానమున నట్లుండరాదు. యతి తప్పినది. కాని పాదములోని రెండవ యక్షరముగా

'దు' అనునది కలదు. ఆ దకారమే యతిస్థానము ప్రక్కన రెండవ యక్షరముగా వాడఁబడినది. కావున యతి తప్పినను ప్రాసాంశము వాడ బడినది. గాన ప్రాసయతి యుపయోగించినట్లయి ఛందస్సునకు సరిపడినది ఈ ప్రాసయతి కొన్ని పద్యములకు మాత్రమే చెప్పబడినది.

లయగ్రాహి పద్యలక్షణమే ఉదాహరణముగాఁ జూపఁ బడు చున్నది.

| | భ | జ | స | న | భ |
|---|---|---|---|---|---|
| | UII | IUI | IIU | III | UII |
| ఉదా:— | ఇంబడ | రగాభ | జసనం | బులక | దన్భజ |

| జ | స | న | భ | య |
|---|---|---|---|---|
| IUI | IIU | III | UII | IUU |
| సనంబు | లుభకా | రమునొ | దంఁబడి | లయగ్రా |

| భ | జ | స | న | భ |
|---|---|---|---|---|
| UII | IIU | IIU | III | UII |
| హింటరఁ | గఁజెప్పు | కలసం | బిడిన | య్యట్లయ |

| జ | స | న | భ | య |
|---|---|---|---|---|
| IUI | IIU | III | UII | IUU |
| గణంబు | కృతిమీఁ | దనమ | రంబర | హితార్థీ |

ఈ పద్యమునం దంతటను అన్ని పాదములయందును ఒకే ప్రాసయతి నడుపవలసి యుండును.

16. లయ విభాతి:—

న, స, న, న, స, న, న, స, న, న, స, గ, అనునవి ఇందు వచ్చు గణములు.

1)

ఈ పద్యమునఁ గూడ ప్రాసయతి మాత్రమే 10, 19, 28, స్థానములందు ఉపయోగింపవలయును.

లక్షణముగాఁ జెప్పిన పద్యమునే ఉదాహరణముగా గ్రహింపనగును.

| | | | | |
|---|---|---|---|---|
| న | స | న | న | స |
| III | IIU | III | III | IIU |
| ఉదా :- నసన | నసనం | బులులు | నసన | నసగం |

| | | | | |
|---|---|---|---|---|
| న | న | స | న | న |
| III | III | IIU | III | III |
| బులును | నెసఁగఁ | గృతిపా | దములు | రసిక |

| | |
|---|---|
| స | గ |
| IIU | U |
| తనుజె | ప్లన్ |

| | | | | |
|---|---|---|---|---|
| న | స | న | న | స |
| III | IIU | III | III | IIU |
| గుసును | శరవే | త్సభగ | యసద్భ | శగుణా |

| | | | |
|---|---|---|---|
| న | న | స | న |
| III | III | IIU | III |
| వినుత | రసల | యవిభా | తియని |

17. మందాక్రాంతా వృత్తము :

మ, భ, న, త, త, గగ అనునవి ఇందు వచ్చు గణములు.

| | | |
|---|---|---|
| న | స | గ |
| III | IIU | U |
| శసమ | సుకపీం | త్రుత్ |

దీనియందు 11వ యక్షరము యతిస్థానము.

లక్షణ పద్యముతోనే ఉదాహరణము చూపఁ బడుచున్నది.

| | | | |
|---|---|---|---|
| మ | భ | న | త |
| UUU | UII | III | UUI |
| ఉదా :- కాంతాకాం | తామభ | నతత | గాకాంతి |

| | |
|---|---|
| త | గగ |
| UUI | UU |
| సంక్రాంతి | మందా |

| | | | |
|---|---|---|---|
| మ | భ | న | త |
| UUU | UII | III | UUI |
| క్రాంతంబ | న్వేరము | రుదశ | మాక్రాంత |

| | |
|---|---|
| త | గగ |
| UUU | UU |
| విశ్రాంత | మైనన్ |

పై 17 పద్యములను వృత్తజాతివానినిగా పరిగణింపవలయును. వీనిని అక్షర సంఖ్య అన్ని పాదములయందు ఒకే తీరుగా నుండును. మఱియు గురు లఘు విన్యాసముగూడ అన్ని పదములందును సమముగానుండును, ప్రాసయుండును.

ఇఁక జాతి ఛందస్సునకు సంబంధించిన పద్యములను దెలిసికొందము. వీనిలోని గణములు పూర్వమువలె అక్షరములు కావు. వీనిని మాత్రగణము అందురు. ఈ గణములను మూఁడు భాగములుగా విభజించిరి.

1. ఇంద్రగణములు. 2. సూర్యగణములు, 3. చంద్రగణములు పీనిలో ప్రస్తుతం ఇంద్రగణములకును, సూర్యగణములకును మాత్రమేపిని యోగ మున్నదిగాన వానిని ముందు తెలిసికొందము.

## గణముల స్వరూపము

1. ఇంద్రగణములు:-

భ, ర, త, నగ, నల, సల

భగణము- UII-రాముఁడు

రగణము- UIU-రాముఁడా !

తగణము- UUI-రాముండు

నగము -IIIU-అనపుడున్

నలము -IIII -అనపుడు

సలము -IIUI -వినవేల

2. సూర్య గణములు:-

న, హ

నగణము-III -అనిన

హగణము-UI -రమ్మ. (దేనినే 'గలము' అనియు నందురు)

1. ఆట వెలఁది:-

ఈ పద్యమునందు మొదటి పాదమును మూఁడవ పాదమును ఒక తీరుగను, రెండవ పాదమును నాల్గవ పాదమును ఒక తీరుగను ఉండును. ప్రతిపాదమునకును 5 గణము లుండును. ప్రతి పాదమునందును నాల్గవ గణముయొక్క మొదటి యక్షరము యతిస్థానమగును. ప్రాసయుండదు. ప్రాసయతి నుపయోగించికొనవచ్చును.

| | |
|---|---|
| సూర్యగణములు-3 | మొదటి పాదమునకు 3వ |
| ఇంద్రగణములు-2 | పాదమునను గూడ ఇట్లే |
| మొత్తము గణములు-5 | యుండును |

సూర్యగణములు 5. రెండవ పాదమునకును, నాల్గవ పాదమునకు గూడ నిట్లే యుండును.

లక్షణ పద్యము:-

ఇనగణత్రయంబు నింద్ర ద్వయంబును
హంస పంచకంబు నాట వెలఁది

ఇనగణములు = సూర్యగణములు

హంస పంచకము = 5 సూర్యగణములు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| | హ | హ | హ | సల | హ |
| | UI | UI | UI | IIUI | UUI |
| ఉదా:- | చెప్పు | లోని | రాయి | చెవిలోని | జోరీఁగ |
| | హ | హ | న | హ | హ |
| | UI | UI | III | UI | UI |
| | కంటి | లోని | నలుసు | కాలి | ముల్లు |

2. తేటగీతి:-

ఈ పద్యమునందు నాలుగు పాదములును సమముగనే యుండును. ప్రతిపాదమునందును నాల్గవ గణముయొక్క మొదటి యక్షరము యతి స్థానమగును. ప్రాసయుండదు. ప్రాసయతి నుపయోగింప వచ్చును. ప్రతి పాదమునందును 5 గణము లుండును,

| | |
|---|---|
| సూర్యగణము-1<br>ఇంద్రగణములు-2<br>సూర్యగణములు-3<br>——<br>మొత్తము 5 | అన్ని పాదములందును గణములు ఈక్రమముగానే యుండును. |

లక్షణ పద

సూర్యుఁ డొకని మీద సురరాజు లిద్దఱు
దినకర ద్వయంబు తేట గీతి
సురరాజులు= ఇంద్రగణములు
దినకరద్వయము = సూర్యగణములు రెండు.

| | హ | నల | త | హ | న |
|---|---|---|---|---|---|
| | UI | IIII | UUI | UI | III |
| ఉదా:- | మీరు | మహిమను | వర్ణింప | మాదు | వశమె |

పై యుదాహరణమునందు ప్రాసయతి యుపయోగింపఁ బడినది.

3. ద్విపద:-

ఈ పద్యమునందు రెండేపాదము లుండును. ఈ ద్విపదతో నారంభింపఁ బడిన గ్రంథమునందంతటను ద్విపదములే వాడఁ బడును. దానిని ద్విపద కావ్యమనియే యందురు. దీనిలో ప్రతిపాదము నందును నాలుగు గుణములు ఉండును. మూఁడవ గుణముయొక్క మొదటి యక్షరము యతి స్థానము. ప్రాసయతి యుపయోగింప వచ్చును. రెండేసి పాదములకు ప్రాసగూడ ఉపయోగింపఁబడును. దానిలో గణములు ఈ క్రింది విధముగా నుండును.

ఇంద్రగణములు—3
సూర్యగణము —1

—

మొత్తము 4 గణములు.

| సల | ర | సల | హ |
|---|---|---|---|
| IIUI | UIU | IIUI | UI |
| ఉదా:— రతిరాజ | సుందరా! | రణరంగ | ధీర |

ప్రాస లేకుండఁ జెప్పినచో దానిని మంజరీ ద్విపద యందురు.

4 తరువోజ:—

ఈ పద్యమునందు ఇంద్రగణములు-2
సూర్యగణము-1
ఇంద్రగణములు-3
సూర్యగణము-1

—

మొత్తము గణములు 8

ప్రతి పాదమునందును పైన చూపినట్లు 8 గణములుండును. ప్రతి పాదమునందును 3 వ గణము మొదటి యక్షరమును, 5 వ గణము మొదటి యక్షరమును, 7 వ గణము మొదటి యక్షరమును యతిస్థానము లగును. ప్రాసయుండును.

లక్షణ పద్యమునే ఉదాహరణముగా గ్రంహించునది.

| సల | నల | సల | హ |
|---|---|---|---|
| IIUI | IIII | IIUI | UI |
| ఉధా:- నళవామ | గణ్ణమలి | నగణాంబు | తోడ |

| భ | త | త | హ |
|---|---|---|---|
| UII | UUI | UUI | UI |
| నాలుగు | గాఁజేసి | నాటించి | యిట్లు |

| నల | నల | నగ | హ |
|---|---|---|---|
| IIII | IIII | IIIU | UI |
| గలయుఁగ | నెనిమిది | గణములై | రెండు |

| నల | నల | త | న |
|---|---|---|---|
| IIII | IIII | UUI | III |
| గణముల | తుదయతి | గానిల్పి | తుదల |

5. మధ్యాక్కర :-

ఈ పద్యమునందు ఇంద్ర గణములు—2
సూర్యగణము—1
ఇంద్రగణములు—2
సూర్యగణము—1

---

మొత్తము గణములు 6 ప్రతి పాదమునందు నుండును.

ప్రతి పాదమునందును 4 వ గణముయొక్క మొదటి యక్షరము యతిస్థానము.

లక్షణ పద్యము ఉదాహరణముగాఁ జెప్పఁబడుచున్నది.

| | నల | సల | హ |
|---|---|---|---|
| | IIUI | IIUI | UI |
| ఉదా :- | సురరాజు | సురరాజుఁ | గూడి |

| ర | నల | న |
|---|---|---|
| UIU | IIII | III |
| సూర్యతో | నొడఁబడి | మఱియు |

| సల | త | హ |
|---|---|---|
| IIUI | UUI | UI |
| గరమొప్ప | నిప్పాట | నారు |

| నల | త | హ |
|---|---|---|
| IIII | UUI | UI |
| గణముల | మధ్యాక్క | రంబు |

6. ఉత్సాహ వృత్తము:-

ఈ పద్యమునందు సూర్య గణములు-7
గురువు-1

మొత్తము గణములు 8

ప్రతిపాదమునందును 5 వ గణము మొదటి యక్షరము యతిస్థానమగును.

లక్షణ పద్యపాదమే ఉదాహరణముగాఁ జెప్ప బడుచున్నది.

| | హ | హ | న | న | న |
|---|---|---|---|---|---|
| | UI | UI | III | III | III |
| ఉదా :- | ఊహ | నేఁడు | గణము | లుగను | నొనర |

| న | హ | గ |
|---|---|---|
| III | UI | U |
| నగణ | మొండెఁ | దత్ |

| హ | హ | హ | న | న |
|---|---|---|---|---|
| UI | UI | UI | III | III |
| సాహ | చర్య | మొండె | గురక | సహిత |

| న | హ | గ | హ | హ |
|---|---|---|---|---|
| III | UI | U | UI | UI |
| ముగనా | నరు | సు | త్సాహ | సయ్యో |

చంద్ర గణములు

1. రగము-UIUU-రామ ! నీవే
2. నగగము-IIIUU-నవర సంబుల్
3. యగము-IUUU -సితాంతంబున్
4. సలగము-IIUUI -సుతునింగనెన్
5. భగురువు-UII U - నీవతనిన్
6. నలగము-IIIIU - అనపుడునున్
7. మలఘువు -UUUI-నీయందాశ
8. సహము -IIUUI - వినవే నీవు
9. రలము -IUIU -పాలవెల్లి
10. నహము -IIIUI - అనిన మాత్ర
11. తలము -IIUU - నీ చేతను
12. సలలము-IIUII -వినవైతివి
13. భలము -UIII -రాజసము
14. నలలము -IIIII -అనవుడును,

7. మధురాక్కర

ఈ పద్యమునందు సూర్యగణము---1.
ఇంద్రగణములు---3
చంద్రగణము--1
---
మొత్తము గణములు 5 ప్రతి పాదమునందును ఉండును.

ప్రతిపాదమునందును 4 వ గణముయొక్క మొదటి యక్షరము యతిస్థాన మగును ఇందు ప్రాసయు నుండును.

లక్షణ పద్యమే ఉదాహరణముగా చూపఁ బడుచున్నది,

| | | | | |
|---|---|---|---|---|
| న | సల | త | ర | రల |
| III | IUII | UUI | UIU | UIUI |
| ఉదా :-రవిది | విజరాజ | గీర్వాణ | రాజదే | వాధిదేవ |

| | | | | |
|---|---|---|---|---|
| న | భ | త | ర | నలల |
| III | UII | UUI | UIU | IIIII |
| కువల | యప్రియ | లిప్పొట | గూడనే | నుగణములు |

| | | |
|---|---|---|
| న | నగ | నల |
| III | IIIU | IIII |
| నవిర | ళముగఁబ్రా | వడిమధు |

| | |
|---|---|
| ర | సగల (సహము) |
| UIU | IIUI |
| రాక్కరం | బుధరలోనఁ |

| | | |
|---|---|---|
| న | భ | సల |
| III | UII | IIUI |
| గవిజ | నాశ్రయుఁ | డెఱిఁగించెఁ |

| నగ | | నగం (నహ) |
|---|---|---|
| IIIU | I | IIUI |
| గవులకిం | పు | జనిఝింప |

8. కంద పద్యము.

ఈ పద్యమునందు గగ, భ, జ, స, నల అను 5 గణములు మాత్రమేవచ్చును. మొదటి పాదమును, మూఁడవ పాదమును సమానముగ నుండును. 2వ పాదమును 4వ పాదమును సమానముగానుండును. మొత్తము సగము పద్యమునకు 8 గణములుండును. మొదటి పాదమునను 3వ పాదమునను మూఁడేసి గణములు మాత్రమే యుండును. 2వ పాదమునను, 4 వ పాదమునను అయిదేసి గణములుండుచు. 2, 4 పాదములలో మాత్రమే 4వ గణముయొక్క మొదటి యక్షరములు యతిస్థానములగును. 1, 3 పాదములలో యతి యుండదు. 2, 4 పాదముల చివర తప్పక గురు వుండవలయును. ప్రతి అర్థ పద్యములోను 1, 3, 5, 7 సంఖ్యలు గల స్థానములందు జగణము ఉండరాదు. 6 వ గణ స్థానమున తప్పక నలముగాని, జగణముగాని యుండవలెను. మొదటి సగము పద్యమువలెనే తక్కిన సగము పద్యము ఉండును. ఇందు ప్రాసయుండును.

| గగ | నల | భ |
|---|---|---|
| UU | IIII | UII |
| ఉదా :- శ్రీరా | మునిదయ | చేతను |

| గగ | నల | నల | గగ | స |
|---|---|---|---|---|
| UU | IIII | IIII | UU | IIU |
| నారా | ధిగసక | లజనులు | నౌరా | యనగా |

# 7. అలంకారములు

శరీరమునకు ఆలంకారములు శోభ నిచ్చినట్లు కావ్యమునకు అలంకారములు శోభనిచ్చును. అట్టి యలంకారములు శబ్దాలంకారములనియు, అర్థలంకారము లనియు రెండు విధములు. పద్యముగాని, వాక్యముగాని అర్థముగాకున్నను శబ్దముల కూర్పులోని సొంపు చెవికింపు గలిగించినచో వానిని శబ్దాలంకారములందురు. అర్థము తెలిసికొనిన మీఁదట మన మనములకు నానందము కలిగించినవి అర్థాలంకారములు. ముందు శబ్దాలంకారములను గూర్చి తెలిసికొందము.

## అనుప్రాసము:-

రసమును ప్రోత్సహించుచు వింతయయిన యక్షర విన్యాసముకలిగి యుండునది అనుప్రాసము. ఇది వృత్త్యనుప్రాసము, ఛేకానుప్రాసము, లాటానుప్రాసము, అంత్యనుప్రాసమునని నాలుగు విధములుగ నుండును. దీని వంటివే యమకము' ముక్తపదగ్రస్తము నననువి రెండు గలవు. ఇవి మొత్తము 6.

(1) వృత్త్యనుప్రాసము:-

ఒకే హల్లు చాలసారులు ఒకే వాక్యములోగాని, పద్యములోగాని ఆవృత్తమయినచో దానిని వృత్త్యనుప్రాస మందురు.

**ఉదా:-బాలిక కేళిక తాలసతాళి సదచిరావతరణి తురిణిమ తరుణి**

లోలాలసాలస విలస నాలోకములు విటాళి నట్టిటు చేసెన్.

పై పద్యమునందు శకారము సకారము రేఫ తకారము, లకారము చాల పర్యాయములు వెంట వెంటనే వచ్చి చెవి కింపు జనింపఁ జేయుచున్నవి కావున నిది వృత్త్యనుప్రాసము.

2. ఛేకానుప్రాసము:-

అర్థ భేదముతో రెండు హల్లులు వెంట వెంటనే రెండు పర్యాయము ములు ఉపయోగింపఁ బడినచో దానిని ఛేకానుప్రాస మందురు.

ఉదా:- శోక సముద్రంబు దరిఁ దరివలె మమ్ముఁజేర్పుము.

పై వాక్యమున దరి దరి అని రెండు పర్యాయము లుపయోగింపఁ బడినవి.

3. లాటానుప్రాసము:-

భావ భేదము గలిగి ఒకే శబ్దము వెంటనే మరలఁ జెప్పఁబడినచో దానిని లాటానుప్రాస మందురు.

ఉదా:- కమలాక్షు నర్చించు కరములు కరములు — శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ.

పై యుదాహరణమున కరములు అను శబ్దము వెంట వెండదే రెండు పర్యాయములు చెప్పబడినది. అట్లే జిహ్వ జిహ్వ యనియు జిహ్వ యను పదము రెండు పర్యాయములు వెంట వెంటనే చెప్పఁబడినది. ఈ జంట పదములలో అర్థ భేదములేదు. భావభేదము మాత్ర మున్నది. కమలాక్షుని అర్చించు కరమే కరము అని భావము.

4. అంత్యానుప్రాసము :-

కొన్ని పదములయొక్కగాని, వాక్యములయొక్కగాని, పాదముల యొక్కగాని చివరి భాగములందు కొన్ని యక్షరములుగాని, ఒకే యక్షరముగాని తప్పకవచ్చినచో దానిని అంత్యానుప్రాస యందురు.

ఉదా:- 1. 'చిత్ర చిత్ర ప్రభావ! దాక్షిణ్య భావ!
హత విమత జీవ! శ్రీకాకుళాంధ్ర దేవ',

పై పద్యభాగమునందు ప్రతి సంబోధము చివరి భాగమునందును వ అను నక్షరము నియమముగా నుపయోగింపఁ బడినది.

2. 'అనుదిన సంతోషణములు
జనితశ్రమ తాప దుఃఖ సంశోషణముల్
తనయుల సంభాషణములు
జనకులకుం గర్ణయుగళ సద్భూషణముల్.

పై పద్యమున ప్రతిపాదమునందును 'షణములు' అను నాలుగక్షరములు అంత్యప్రాసగా కూర్చఁ బడినవి.

5. యమకము:-

అక్షరముల సమూహము అర్థ భేదముతో మరల వచ్చినచో దానిని యమకమందురు

ఉదా.- "మారుతమ్ముల వాడికి మలయకూట
మారుతమ్ముల వేడికి మట్టు మీఱు
చంద్ర కిరణమ్ములకు శుకశారి కాళి
చంద్రకిరణమ్ములకుఁ జాల జలదరించు"

పై యుదాహరణమునందు మారుతమ్ములు, చంద్రకిరణమ్ములకు, అను రెండు పదములును అర్థ భేదముగ ఉపయోగింపఁబడినది.

మారు తమ్ములు=మన్మథుని బాణములైన తామర పూవులు.

మారుతమ్ములు=గాడ్పులు.

చంద్ర కిరణమ్ములకు=చంద్రునియొక్క కిరణములకు.

చంద్రకి రణమ్ములకు=నెమిళ్ళ యొక్క రకములు.

ఇందెన్ని యక్షరములైన నుండవచ్చును. అర్థ భేద మిందు ముఖ్యము. లాటాను ప్రాసమున భావ భేదమున్న చాలును ఇందు అర్థ భేదము ఉండవలెను. యమకమునందు హల్లులతోఁ బాటు అచ్చులు గూడ కలసివలయును. వృత్త్యను ప్రాసమునందుగాని, ఛేకానుప్రాసమందు గాని అచ్చులు కలియుట ముఖ్యము కాదు

6. ముక్తపద గ్రస్తము:-

ఇది గూడ శబ్దాలంకారములోనిదే. ఒక వాక్యము చివరనున్న పదములోదనే వెంటనే అదే పదమువలెనున్న అక్షర సమూహముతో తరువాతి వాక్యము నారంభించుచు నడుపుట.

ఉదా:-వారక వారకామినులవర్తుల చారు కుచోప గూహముల్
కోరక కోరకోల్లసిత కుంజములన్ జిగురాకు పానుపుల్
చేరక చేర కేరళ కళింగ కుళింగ నరేంద్ర మందిర
ద్వారవిహారులై సిరుల నందక నందకపాణిఁ గొల్వరే.

-౦-

# 8. అర్థాలంకారములు

అర్థములకు సంబంధించిన యలంకారములను అర్థాలంకారము లందురు. వీనిని గ్రహించుటకు అవి కలిగియున్న పద్యములయొక్క గాని, వాక్యములయొక్క గాని అర్థము బాగుగాఁ దెలియవలయును. ఇవి చంద్రాలోకము మున్నగు గ్రంథములందు పందవఱకు జెప్పబడియున్నవి. వానిలోఁ గొన్ని ముఖ్యాలంకారములను దెలిసికొందము. అర్థాలంకారముల కొన్నింటికిని ఆధారభూతమైనదియు, ముఖ్యమైనదియు ఉపమాలంకారము. కావన దానిని ముందు తెలిసికొందము.

ఉపమ:— దీనియందు ఉపమానము = పోలికకుఁ దేఁబడిన వస్తువును బోధించు పదము.

ఉపమేయము= వర్ణించు వస్తువును బోధించు పదము.

సమాన ధర్మము, సాధారణ ధర్మము = ఏధర్మమునుబట్టి ఆ రెండు వస్తువులను పోల్చుచున్నామో దానిని బోధించు పదము.

ఉపమా వాచకము:— పోలికను స్పష్టపఱచు పదము.

పై నాలుగంశములును ఉన్న దానిని ఉపమాలంకార మందురు.

ఇందు ఉపమానోపమేయములకు సామ్యము చెప్పఁబడును.

ఉదా:—ఓ కృష్ణా. నీ కీర్తి హంసవలె ఆకాశగంగయందు స్నానమాడు. చున్నది.

ఇందు హంస– ఉపమానము, కీర్తి–ఉపమేయము.

ఆకాశగంగ యందుస్నానమాడుట–సమాన ధర్మము, వలె–ఉపమా వాచకము.

2 ఉత్ప్రేక్ష:–

ఒక తీరుగానున్న వస్తువును పోలికనుబట్టి ఉపమాన వస్తువునుగా కవి స్వప్రతిభతో నుహించి చెప్పినచో దానిని ఉత్ప్రేక్ష యందురు.

ఉదా:– పద్మాకారముననున్న ఈ కోట సరోవరము మధ్య పుట్టిన పెద్ద పద్మమా అన్నట్లున్నది. లేకున్న కోటచుట్టును లోతైన నీటి మడు గుండనేల ?

పై యుదహరణమున కోటచుట్టునున్న అగడ్త లోని నీటిని సరస్సు యొక్క అంచుగాను, కోటను ఆందు మొలిచిన పద్మమునుగాను కవి ఊహించినాఁడు. కావున ఇది ఉత్ప్రేక్ష.

ఇది వస్తూత్ప్రేక్ష, హేతూత్ప్రేక్ష, ఫలోత్ప్రేక్ష యని మూఁడు విధములుగా నుండును.

ఒక వస్తువును మఱొక వస్తువుగా నూహించుట వస్తూత్ప్రేక్ష,

హేతువుకాని దానిని హేతువుగా నూహించుట హేతూత్ప్రేక్ష.

ఫలము కాని దానిని ఫలమునుగా నూహించుట ఫలోత్ప్రేక్ష.

పై యుదాహరణములోనిది వస్తూత్ప్రేక్ష.

3. రూపకము:–

ఉపమేయమునందు ఉపమాన ధర్మము నారోపించి చెప్పినచో దానిని రూపకమందురు.

1. ఉదా:- నీ ముఖ చంద్రుడు ఈనాడు మిక్కిలి ప్రకాశించు చున్నాఁడు.

పై యుదాహరణమున ఉపమేయమయిన ముఖమునందు ఉపమాన వస్తువైన చంద్రధర్మ మారోపింపఁ బడినది. కాన నిది రూపకము.

2. ఉదా:- నీవు మాతృవంశ సముద్రమునందు జనించిన సాక్షా ల్లక్ష్మివేనమ్మా.

4. అర్థాంతర న్యాసము:-

సామాన్యమును విశేషముచే సమర్థించినను, విశేషమును సామాన్య ముచే సమర్థించినను అర్థాంతరన్యాస మగును.

1. ఉదా:- హనుమంతుఁడు సముద్రమును దాటెను. మహాత్ములకు దుష్కరమైన కార్య మేమియున్నది ?

పై యుదాహరణమున హనుమంతుఁడు సముద్రమును దాటెనను విశేషము మహాత్ములకు దుష్కరమేమియున్నది ? అను సామేతచే సమ ర్థింపఁ బడినది. కాన నిది సామాన్యముచే విశేషము సమర్థింపఁ బడిన యర్థాంతరన్యాసము.

2. ఉదా:- వివేకమును గోల్పోయిన వారి భ్రష్టతలు అనేక విధ ములుగా నుండును. ధనము కొఱకై హత్యచేసిన వాఁడు, అపహరించిన సొమ్మును కోల్పోయినాఁడు, తన భార్యా పుత్రులకు దూరమైనాఁడు. తుదకు ఉరి తీయఁబడి ప్రాణములనే కోల్పోయినాఁడు.

5. అతిశయోక్తి:-

ఉపమేయమును మఱుగు పఱచి ఉపమానమును మాత్రమే చెప్పినచో దానిని అతిశయోక్తి యందురు. (కొలదిగానున్న దానిని గొప్ప చేసి చెప్పుట అతిశయోక్తి).

1. ఉదా:- నల్ల కలువల జంటనుండి వాడియైన బాణములు వెల్వడు చున్నవి.

పై యుదాహరణమున ఉపమేయము స్త్రీయొక్క నేత్రముల జంట దానిని మఱుగు పఱచి ఉపమాన వస్తువులైన నల్ల కలువల జతయే చెప్పఁబడినది. అట్లే స్త్రీ చూపులు ఉపమేయములు కాఁగా వానిని మఱుగు పఱచి వాడి బాణములను నుపమాన వస్తువులే చెప్పఁబడినవి. కావుననే నల్ల కలువల జంటనుండి వాడియయిన బాణములు వెల్వడుచున్నవి. యని చెప్పుట సాధ్యపడినది. దీనియందుపమేయములు కానరావు దీనికి రూపకాతిశయోక్తి యని పేరు.

2. ఉదా:- రాజా! అమృతము నీ మాటలయందుండఁగా భ్రాంతి గలవారు ఆ యమృతమును జంద్రుని యందుఁ జూచెదరు.

ఇందు, మాటలయందలి మాధుర్యమే అమృతమనుట అతిశయోక్తి యగుచున్నది. చంద్రమండలము నందున్నది యమృతము కాదను అపహ్నుతితో నీ యతియోక్తి కూడియున్నది. గావున దినిని సాపహ్నవాతిశయోక్తి యందురు.

6. స్వభావోక్తి:--

జాతి గుణాదులయందున్న స్వభావమును మధురముగా వర్ణించినచో దానిని స్వభావోక్తి యందురు.

ఉదా -నరవెంట్రుకల బర్వు శిరమువలన, బాహుపక్షోజలంబనము
వలన, మేనివళులవలన, ముడుత కన్బొమలవలన,
ఘనకాస కుహికుహిధ్వనుల వలన భావజుఁడు వెళ్లి
పోయిన పాడుమేడ పగిదిఁ గాన్పించు ముదుసలి
పడతియొకతె.

పై యుదాహరణమున ముసలి యువతి యొక్క యాకారము కండ్లకుఁ గట్టినట్లు వర్ణింపఁ బడినది. కాననిది స్వభావోక్తి.

2. ఉదా:- తుండముల్ సాచి అందుగు జిగుళ్ళకు నిక్కి
కరుల దంతచ్ఛాయ గడలు కొనఁగ.

పై యుదాహరణమునందు అడవి యేనుగుఁల స్వేచ్ఛా విహారము మధురముగా వర్ణింపఁ బడినది. కాన నిది స్వభావోక్తి.

7. సదేహాలంకారము:-

ఏదైన వస్తువును జూచి ఇదియా? అదియా? యని సందేహించుట సందేహాలంకారము.

ఉదా:- చంద్ర బింబములోని మచ్చ మట్టియా ఇజ్జియా మాకు
నిర్ణయము కానున్నది.

8. భ్రాంతిమ దలంకారము:-

ఒక వస్తువును పొరపాటున వేఱొక వస్తువుగా భావించుట భ్రాంతి మలదలలకారమగును.

ఉదా:- ప్రేయసీ! నీవిచటికి వచ్చిన వెంటనే తుమ్మెదలు నీ ముఖ
మును పద్మమనుకొని మూగుచున్నవి.

ఈ యుదాహరణమున తుమ్మెదలకు ముఖమునందు పద్మభ్రాంతి కలిగినట్లు చెప్పఁబడినది గావ ఇది భ్రాంతి మదలంకారము.

9. శ్లేషాలంకారము:-

అనేకార్థములుగల శబ్దములతో అనేకార్థములు తోచునట్లు చేసినచో దానిని శ్లేషాలంకార మందురు.

ఉదా:- రాజు కువల యానంద కరుఁడు.

పై యుదాహరణమున రాజు అను శబ్దమునకు రాజు, చంద్రుఁడు అను రెండర్థములు గలవు. అట్లే కువలయము అను శబ్దమునకు భూమండలము, కలువ అను రెండర్థములు కలవు. కావున చంద్రుడు కలువలకు ఆనందను నిచ్చువాఁడనియు రాజు భూమండలమున కానందము నిచ్చువాఁడనియు రెండర్థములు స్ఫురించుచున్నవి. కాననిది శ్లేషాలంకారము.

ఇది ప్రకృత శ్లేషయనియు, అప్రకృత శ్లేషయనియు, ప్రకృతాప్రకృత శ్లేషయనియు, 3 విధములు.

రెండర్థములును ప్రకృతమునకు సంబంధించి యున్నచో అది ప్రకృత శ్లేష యగును.

ఉదా:- మిమ్ము మాధవుఁడు రక్షించుగాక.

పై యుదాహరణమున మాధవుఁడు=విష్ణువు.

ఉమాధవుఁడు=ఈశ్వరుడు

అను రెండర్థములు ఆశీర్వచన రూపమైన ప్రకృత విషయమునకు సంబంధించినవే గాన దీనిని ప్రకృత శ్లేషమందురు.

ఒక యర్థము ప్రకృతమునకును, ఇంకొక యర్థము ప్రకృతము కాని దానికి సంబంధించి యున్నచో దానిని ప్రకృతాప్రకృత శ్లేష యందురు.

ఉదా;- ఇనాలోకయోగము మణిని బుధమణిని ప్రకాశింపఁ జేయును.

పై యుదాహరణమున ఇన + ఆలోకయోగము = సూర్యుని వెలుతురుతో సంబంధము, రాజుయొక్క దర్శనముతో సంబంధము అను రెండర్థములుగల పదమువలన ప్రకృతమయిన పండితుని విషయమును, అప్రకృతమయిన మణి విషయమును స్ఫురించుచున్నవి గానఇది ప్రకృతాప్రకృత శ్లేష.

10. కావ్యలింగము:-

కారణముచే కార్యమును గాని, కార్యముచే కారణమును గాని సమర్థించినచో దానిని చవ్యలింగము మందురు.

ఉదా:- సన్నింక యముఁడేమి చేయఁ గలఁడు ? నేను కాలకాలు నాశ్రయించినాను.

పై యుదాహరణమున తదను యముఁ డేమియుఁ జేయఁజాలఁడు అను దానిని కాలకాలుని తానాశ్రయించుట కారణముగాఁ జెప్పి సమర్థించుట జరిగినది గాననిది కావ్యలింగము.

11. దృష్టాంతాలంకారము:-

రెండు వాక్యములకును బింబ ప్రతిబింబ భావము కల్పింపఁబడినచో ధానిని దృష్టాంతాలంకార మందురు.

ఉదా:- రాజా ! రాజులలో నీవు కీర్తిమంతుఁడవు. చుక్కలలో చంద్రుఁడే కాంతి మంతుఁడు.

పై యుదాహరణమున రాజునకును చంద్రునకు కీర్తి మత్త్వము, కాంతిమత్త్వము అను భిన్న ధర్మములు బింబ ప్రతిబింబ భావముచే నిర్దేశింపఁ బడినవి. కావుననిది దృష్టాంతము.

12. నిదర్శనాలంకారము:-

సమానములైన వాక్యార్థముల పరస్పర భేదము లేనట్లువర్ణించినచో దానిని నిదర్శనాలంకార మందురు.

ఉదా:- మూర్ఖునికి హితము చెప్పఁ బూనుట చెవిటికి శంఖము పట్టుటయే.

13. ప్రతి వస్తూపమాలంకారము:-

రెండు భిన్న భిన్న వాక్యములకు ఏక సామ్యము చెప్పినచో దానిని ప్రతివస్తూపమాలంకారమందురు.

ఉదా:- రత్నము సూర్య కాంతియోగముచే ప్రకాశించును.
బుద్ధిమంతుఁడు రాజదర్శన యోగముచే ప్రకాశించును.

పై యుదాహరణమున ఉపమానోపమేయ వాక్యముల యందు ప్రకాశించుటయను సమానధర్మము వేర్వేఱు పదములచే చెప్పఁ బడినది.

14. అనన్వయము:-

ఒకే వస్తువు ఉపమానోపమేయములుగా వర్ణింపఁ బడినచో దానిని అనన్వయాలంకారమందురు.

ఉదా:- నీకునీవే సాటి.
అతని కతఁడే సాటి ॥మొ॥

15. ఉపమేయోపమాలంకారము:—

ఉపమానము నుపమేయముగను, ఉపమేయమును ఉపమానము గను వర్ణించినచో దానిని ఉపమేయోపమాలంకార మందురు.

ఉద:— మన్మథుఁడు చంద్రునివలెను, చంద్రుడు మన్మథునివలెను విరహులను బాధించుట యందు నిపుణులు.

16. ప్రతీపాలంకారము:—

1. ఉపమానమును ఉపమేయమునుగాఁ జెప్పినచో దానిని ప్రతీపాలంకార మందురు.

పద్మము నీ ముఖముతో సామ్యము నందుచున్నది.

2. ఉపమానము నుపమేయముగా స్వీకరించి ఉపమేయమున కనాదరము కల్పించినను ప్రతీపాలంకారమే యగును.

ఉదా:- కాంతి యందు నిన్నుఁబోలిన చంద్రుఁ డుండఁగా ఓ ముఖమా! గర్వ పడెదవేల?

3. ఉపమేయమువలన ఉపమానవస్తువున కనాదరము గలిగినను ప్రతీపాలంకార మగును.

ఉదా:- మృత్యువా! నీతో సమానములైన కాంతాజనము లుండఁగా నీకు క్రౌర్య దర్పమేల?

4. ఉపమేయమువలన ఉపమానవస్తువుయొక్క ఉపమానార్హతకు భంగము కలుగునట్లు చెప్పినచో దానిని గూడ ప్రతీపమే యందురు.

ఉదా:— వనితా! పద్మములు నీ కన్నులతోసమానములందురు. ఇది
నిజము కాదు వట్టి యపవాదము మాత్రమే.

౬. ఉపమానమువలనఁ ప్రయోజనము ఏమి గలదు? అని చెప్పి
నను ప్రతీపమే యగును.

ఉదా:— ఈమె ముఖమును దర్శించిన వారికి పద్మ దర్శనమేల?

17. పరిణామాలంకారము:—

ఉపమానము ఉపమేయముతో తాదాత్మ్యమును బొందు క్రియతో గూడి యుండినచో పరిణామాలంకార మగును.

ఉదా - విశాల నేత్రములు గల ఈ వనిత ప్రసన్నములైన ఈక్షణాంబుజములతోఁ జూచుచున్నది.

పై యుదాహరణమున చూచుట యను క్రియ అంబుజములకు అన్వయించుచున్నది. అబుజములు చూడఁజాలవు. కావున అంబుజములు నేత్రములుగా బరిణమించినవని చెప్పవలయును.

18. ఉల్లేఖము:—

ఒక వస్తువు ననేకులు అనేక విధములుగాఁ జెప్పుటగాని, ఒకఁడే ఒక వస్తువు ననేక విధములుగాఁజెప్పుటగాని జరిగిన దానిని ఉల్లేఖాలంకార మందురు.

ఉదా:— ఓ చంద్రుఁడా ! నీలోని నలుపును కొందఱు పుట్టుమచ్చ
యనిరి సముద్రములోని నుండి పుట్టునప్పుడు అంటిన
బురదయని కొందరనిరి, లేడి యని కొందరనిరి. భూమి
యొక్క ఛాయ యని కొందరనిరి. నేను రాత్రివేళ

త్రాగిన చీఁకటియే నీ పొట్టలో నిలిచి యట్టు కానవచ్చు
చున్నది.

19. స్మృత్యలంకారము:—

ఒక దానిని జూచి యింకొక వస్తువును స్మరించినచో దానిని స్మరణాలంకార మందురు.

ఉదా:- లేళ్ళ చూపులను జూచుచున్న నామనమునకు కాంత చూపులు స్మరణమునకు వచ్చుచున్నవి.

20. అపహ్నుతి.-

1. ఉపమేయ వస్తువునందు అన్యవర్ణనము నారోపించుటకై ఉపమేయ ధర్మమా వస్తువునందు లేదని చెప్పినచో దానిని అపహ్నుతి యందురు.

ఉదా:—ఇది కోట గాదు. పెద్ద సరస్సు మధ్య భాగమున మొలిచిన పెద్ద పద్మము. కోటయందు పద్మత్వము నారోపించుటకై కోట కాదని చెప్పఁబడినది. దీనిని శుద్ధాపహ్నుతి యందురు.

2. హేత్వపహ్నుతి:—అపహ్నుతి యుక్తిపూర్వకముగా నున్నచో హేత్వపహ్నుతి యగును.

ఉదా:--ఇతఁడు దారుణముగా నున్నాఁడు. కాన చంద్రుఁడు కాఁడు అదరులు మిసెడు కొఱవిదయ్యంబు కీఁడు.

3. పర్యస్తాపహ్నుతి:—

ఉపమేయమునందారోపించుటకై ఉపమాన వస్తువుయొక్క ధర్మము లేదని చెప్పినచో దానిని 'పర్యస్తాపహ్నుతి' యందురు.

ఉదా:- ప్రియసీ ముఖమే చంద్రుఁడుగాని యీతఁడు చంద్రుఁడు గాఁడు.

4. భ్రాంతాపహ్నుతి:-

ఇతరుఁడు శంకించినప్పుడు నిజము చెప్పి భ్రాంతిని దొలగించిసచో దానిని 'భ్రాంతాపహ్నుతి' యందురు.

ఉదా:-మిత్రుడా! అది మొదట పాణిని గ్రహించినది. తరువాత కటి భాగము నాక్రమించినది. నఖముఖ లాలనముచే సుఖపదయినది.

మిత్రుఁడా! అది వనితయా యేమి?
కాదోయీ! చీడ.

5. ఛేకాపహ్నుతి:—

ఇతరులు శంకించినపుడు నిజమును దాచి మాయ చేసినచో దానిని ఛేకాపహ్నుతి యందురు.

ఉదా:- నేను కోపావేశమున రుస రుస లాడుచుఁ బోవుచుండ గోల పెట్టుచు నాపదముల కడ్డు పడెను. నీ పెనిమిటి కాదుగద! కాదు కాదు అందె గోల చేయుచు కాలి కడ్డు పడినది.

6. క్రైతవాపహ్నుతి:-

వ్యాజము, మిష. క్రైతవము, ఛలము మున్నగు పదములచేత అపహ్నుదమున్నచో దానిని క్రైతవాపహ్నుతి యందురు.

ఉదా:- వనితల దృష్టులను నెపముతో మన్మధుని విశిఖములు వెల్వడు చున్నవి.

21. తుల్యయోగిత :—

శత్రువుల యందును మిత్రుల యందును సమానమైన ప్రవృత్తి వర్ణింప బడినచో దానిని తుల్యయోగిత యందురు.

ఉదా:— ఓ రాజా ! నీవు శత్రువులకును మిత్రులకును అభయ మిచ్చితివి.

అభయము = దేనికన్న మించిన భయములేదో అది అభయము.

అభయము=రక్షణ.

పై యుదాహరణమున కేవలము శబ్ద సామ్యమున్నది.

ఉత్కృష్ట గుణములు గలవారితో సామ్యమును వివక్షించి చెప్పినను తుల్యయోగిత యగును.

ఉదా:— నలుయజ్ఞము, ధర్మజు రాజసూయమున్, నీయజ్ఞమును నొక్కరూప.

22. దీపకాలంకారము:—

ఉపమేయమునకును, ఉపమానమునకును ధర్మైక్యము చెప్పినచో దానిని దీపకాలంకారమందురు.

ఉదా:— పండితుఁడు విద్యచే ప్రకాశించును. రాజు పరాక్రమముచే ప్రకాశించును.

పై యుదాహరణమున ప్రకాశించుట యను ధర్మము ఉపమానోప మేయములయందు ఒక్కటిగా చూపఁబడినది. కాన నిది దీపకాలంకారము.

23. వ్యతిరేకాలంకారము:—

ఉపమానోపమేయములలో నొక దానికి ఆధిక్యమును గల్పించినచో దానిని వ్యతిరేకాలంకార మందురు.

ఉదా:— అర్యులు కొండలవలె సమున్నతులు, కాని, వారు స్వభావముచే కోమలులు.

24. సహోక్తి.—

సహస్థితి జనరంజకముగా వర్ణింపఁబడినచో దానిని సహోక్తి యందురు.

ఉదా — నీ కీర్తికి వెఱచిన చీకటి నీకు వెఱచిన శత్రువులతోఁ బాటు కొండ గుహలలో దాగుకొన్నది.

25. సమాసోక్తి:—

ప్రకృతమును వర్ణించుచుండఁగా అప్రకృతము స్ఫురించినచో దానిని సమాసోక్తి యందురు.

ఉదా.— గిరిగింతలు కొట్టుచున్న కుచ భారము కలుగునటును. జుట్టు కలిసిపోవునట్లును, హారములు ఊగిసలాడునట్లును, గంతులిడుచున్న కర్ణాభరణములచే చెంపలు ప్రకాశించునట్లును, ముఖమున చెమటకమ్మునట్లును, మాటి మాటికి హస్తాస్ఫాలనముల నొసగునట్లును, మిక్కిలి యాయాసము గలగునట్లును సరసముగా ఈసుభగచేత సేవింపఁ బడుచున్నావు.

ఓ కందుకమా! నీ ధన్యత్వమును ఏమనందును?

పై యుదాహరణమున బంతియాడుచున్న బాలికయొక్క స్థితిని వర్ణింపఁ బడినది. ఇందు కందుక శబ్దము పుంలింగమగుటచేతను, సరసముగా సుభగచే సేవింపఁబడుచున్నావు అనుటచేతను పురుషాయిత క్రియ గమ్యమానమగు చున్నది. కావున నిది సమాసోక్తి. అప్రస్తుతమయిన పురుషాయిత క్రియగమ్యమానమగుట యందలి విశేషము.

26. అప్రస్తుత ప్రశంస:—

ప్రకృతము తోచునట్లు అప్రకృతమును జెప్పినచో నిది యప్రస్తుత ప్రసంసాలంకార మగును.

ఉదా:— కుక్క మెడకు జూలు తగిలించి సింహపదవియందు నిలిపినచో అది మదించిన యేనుఁగు యొక్క కుంభస్థలమును బగులఁగొట్టుట యందు కుతుహలపడు సింహముయొక్క నాదము చేయఁగలుగునా?

పై యుదాహరణము ప్రకృతము కాకపోయినను దానివలన యోగ్యుఁడు కాని వానిని ఒక పదవియందు నియమించి యతఁడాపదవిని నిర్వహింపలేని స్థితి ప్రకృతమై తోచుచున్నది. కావున నిది అప్రస్తుత ప్రశంశ.

27. పరికరము:—

విశేషణములు సాభిప్రాయములైనచో దానిని పరకర మందురు.

ఉదా:— గంగా జనకుఁడు మాధవుఁడు మాసంసారతాపమును దొలఁగించు గాత. ఇందు గంగాజనకుఁడను విశేషణము సాభిప్రాయము. గంగ చలువ నిచ్చునది గాన అట్టి

గంగను సృష్టించిన మాధవునకు మా సంసార తాపములను హరించుట యేమి లెక్కయని భావము.

28. పరికరాంకురము:—

విశేష్యము సాభిప్రాయ మైనచో దానిని పరికరాంకుర మందురు.
ఉదా.— రత్నములకు నిధియైన యతఁడు రత్నాకరుఁడే.

29. ప్రస్తుతాంకురము —

ఒక ప్రకృతమువలన మఱొక ప్రకృతము గమ్యమానమయినచో దానిని ప్రస్తుతాంకుర మందురు.

ఉదా:— భ్రమరమా! మాధవియుండఁగా ముండ్లతో నిండియున్న మొగలిపొదపై వ్రాలెదవేల?

పై యుదాహరణము ప్రియునితో నుద్యాన వనవిహారమున నలుపు నాయికచే పలుకఁబడి తుమ్మెదను గూర్చి పలుకుట ప్రకృతము. ఈ ప్రకృతమువలన 'ప్రియుఁడా! సర్వ విధముల నీకనుకూలవతి నైన నేనుండఁగా గష్టములను దెచ్చిపెట్టు పరస్త్రీ వాంఛ ఏల చేసెదవను మఱొక ప్రకృతము గమ్యమాన మగుచున్నది. ఉద్యానవనముగాన భ్రమరప్రశంస ప్రకృత మగుచున్నది. నాయికానాయకుల విషయముగాన భర్తను గూర్చిన మందలింపును ప్రకృతమే యగుచున్నది.

30. వ్యాజస్తుతి:—

నిందవలన స్తుతిగాని, స్తుతివలన నిందగాని గమ్యమాన మైనచో వ్యాజస్తుతి యగును.

1. ఉదా:-నాఁగలి రోకలన్నకు నిచ్చి శంఖాది పంచాయుధము లీవు పట్టినావు. ఇందు అన్నయిన బాలరామునికి పనికిరాని నాగలి రోకలి యను మోటు ఆయుధము నిచ్చి మోస గించి, నాగరకములయిన శంఖము మొదలయిన యాయు ధములను నీవు కాఁజేసినావు అని పైని నిందగాతోచు చున్నది. కాని నీవు శంఖాద్యాయుధములు ధరించు ప్రభు వవని లోలోన పొగడ్త యున్నది.

2. స్తుతివలన నింద:-

ఉదా:- దూతికా! నా కొరకు దంత క్షతములను నఖక్షతములను అనుభవించినావు. ఎంత మంచి దానవు?

పై యుదాహరణమున నాయిక దూతికను పొగడుచున్నట్లు కన్పించుచున్నది. నా కొఱకై నీవు చాల కష్టములనుభవించినావు. ఎంత మంచిదానవు ? అని పొగడ్త. కాని, నా విషయమై దౌత్యము చేయుటకు నాయకుని కడకేగి అనితతో నీవే సుఖించినావు. ఎంత మోసకత్తెవే" అని అంతరార్థము.

31. వ్యాజనింద:-

ఒక నిందవలన నింకొక నింద స్ఫురించినచో దానిని వ్యాజనింద యందురు.

ఉదా:-ఒక్క తలను త్రుంచిన శివునన వలెఁగాని, బ్రహ్మనేమన వలెను.

పై యుదాహరణమున బ్రహ్మయొక్క అయిదు తలలను ద్రుంచి వేయక ఒక తలను మాత్రమే త్రుంచినాఁడను శివనిందవలన, దుఃఖ

పూరితమయిన ప్రపంచమును సృష్టి చేయుచున్నాఁడను బ్రహ్మనింద గమ్యమాన మగుచున్నది. కాననిది వ్యాజనిందాలంకారము.

౩౩. విరోధాభాసము:-

విరోధమున్నట్లు కనిపించి యది సమర్థింపఁబడి ఘోరత్వమును సాధించినచో దానిని విరోధాభాస మందురు.

ఉదా :- ఈతఁడు హిమకర రోచియయ్యును నాయెడ అహిమక రోచియగు చున్నాడు.

పై యుదాహరణమున హిమకరరోచి అహిమకరరోచి యగుట విరోధము. ఇది విరహిణీ వాక్యము గాన చంద్రుఁడు సూర్యుఁడుగా కన్పట్టుట విరహుల యెడ సమర్థనీయము. కావున నిది విరోధాభాసా లంకారము.

౩౩. విభావన:-

1. కార్యము లేకయే కార్యము కలిగినట్లు చెప్పినచో దాని విభావనా లంకార మందురు.

ఉదా:-లాక్షారసము పూయకున్నను ఆ వనిత పాదములు ఎఱుపు రంగు కలిగియున్నవి.

పై యుదాహరణమున లత్తుక పూయకున్నను ఆమె పాదములు లత్తుక పూసినట్లు ఎఱ్ఱగానున్నవి యనుటచే కారణములేకున్నను కార్యము పుట్టినట్లు స్పష్టము. కాని ఆమె పాదములు సహజముగ నేల లత్తుక పూసినంతటి యెఱుపు రంగు కలవి యని యామె సౌందర్య విశేషము పర్ణితము.

2. ప్రతిబంధకమున్నను కార్యము కలిగినట్లు వర్ణించినచో దానిని గూడ **విభావన** యందురు.

**ఉదా:**- బలహీనమయిన చెఱుకు గడను విల్లుగాధరించి మన్మథుఁడు త్రిలోక విజేత యగుచున్నాడు.

పై యుదాహరణమున విలుకాని ధనస్సు బలహినమయ్యును అతనికి త్రిలోక విజయసాధన మగుచున్నదని చెప్పఁబడినది. త్రిలోక విజయమునకు బలహీనమయిన విల్లు కలిగియుండుట ప్రతిబంధకము గదా!

3. కారణము కాని దానినుండి కార్యము పుట్టినదని చెప్పుటయు విభావనయే యగును.

ఉదా:- ఆకాశమునందొక దిగుడు బావి ప్రకాశించుచున్నది దాని పై భాగమున ఇంద్ర నీలములతో నిర్మింపఁబడిన యొక చిన్న మెట్ల దారియున్నది.

పై యుదాహరణమున నాయికను వర్ణించుచు ఆమె నడుమును ఆకాశముగను, ఆమె నాభిని దిగుడు బావిగాను, పైమాగారును ఇంద్రనీలములు పొదిగిని చిన్నమెట్ల దారిగను కవి వర్ణించినాడు. ఆకాశమునందు బావి మున్నగునవి పుట్టినట్లు చెప్పుటచే యిచట విభావన.

34. విశేషోక్తి:-

ప్రసిద్ధములైన కారణములున్నను కార్యము జరుగలేదని చెప్పినచో దానిని విశేషోక్తి యందురు.

ఉదా:- సంధ్య అనురాగవతియే. దివస నాయకుఁడు ఎల్లప్పుడును ఆమెచే ననుసరింపఁ బడుచునే యుండును. కాని ఆ యిద్దఱికిని సమాగము మాత్రములేదు.

పై యుదాహరణమున పరస్పరమును అనురాగవంతులైన యిరువురు నాయికా నాయకులు ఒకరి నొకరు విడువక తిరుగుచుండియు సమాగమము మాత్రము లేదని చెప్పుటచే అనురాగము. అనుసవరణము అను ముఖ్యకారణములున్నను సమాగమము అను కార్యము జరుగలేదని చెప్పుటచే ఇది విశేషోక్తి యగుచున్నది.

35. విషమాలంకారము:-

అనురూపము కాని వానికి సంబంధము వర్ణింపఁబడినచో దానిని విషమాలంకార మందురు.

1. ఉదా:- మృదు శరీరముగల ఈమె యెక్కడ? మన్మథ తాప మెక్కడ ?

పై వాక్యమున లనురూపములు గాని వానికి సంబంధము వర్ణింప బడినది. ఒక క్రియ వలన విరుద్ధ కార్యము పుట్టినట్లు చెప్పినను దానిని విషమాలంకారమే యందురు.

2. ఉదా:- పాములవాని బుట్టను తినుబండముల యాశతో కొఱికిన యెలుక అందున్న పాముచే భక్షింపఁబడినది.

పై యుదాహరణమున ఎలుక బుట్టను కన్నము వేయుట అందున్న యాహారమును పైనాశచేకాఁగా, అది పామున్న బుట్టయై ఆ పాము దానిని మింగుట యను విరుద్ధ కార్యము బుట్టినది. కాన నిది విషమాలంకారము.

3. సమాలంకారము:-

అన రూపమ మున రెండు విషయములకు సంబంధమును వర్ణించినచో అది సమాలంకార మగును.

ఉదా:- బ్రహ్మదేవుఁడు వేపపళ్ళను సృష్టించి వాటిరసము నాస్వా దింపఁగల కాకులను గూడ సృష్టించి కృత కృత్యుఁ డైనాఁడు.

పై యుదాహరణమున వేప పళ్ళు వాని రసమునాస్వాదించి తృప్తి పడగల కాకులు అను అనురూపములయిన రెండు విషయములకు సంబం ధము వర్ణింపఁ బడినది గాన నిది సమాలంకాలము.

కారణముతో క్యాముసకు హరూప్యము చెప్పబడినలు దానిని సమాలకకార మందురు.

ఉదా:- సద్వంశమందు బుట్టిన మీ పుత్రులను విద్యావంతులను జేయుట దుష్కరను గాదు.

పై యుదాహరణమును సద్వంశమునందు పుట్టుట యను కారణ ముతో, విద్యావంతులను జేయుట సులభమను కార్యమునకు సారూప్యము చెప్పఁబడినది.

87. కారణమాల:-

ఉత్తరోత్తర వస్తువులకు పూర్వ పూర్వ వస్తువుగాని, పూర్వ పూర్వ వస్తువులకు ఉత్తరోత్తర వస్తువులు గాని కారణములైనట్లు వర్ణించి నచో దానిని కారణమాల యందురు.

1. ఉదా:-విద్య వినయమును వినయముచే పాత్రతయు, పాత్రత వలన ధనమును, ధనమువలన ధర్మమును, సుఖమును గలుగును.

పై యుదాహరణమున ఉత్తరోత్తర పదార్థములకు పూర్వ పూర్వ పదార్థములు కారణమైనవి. కాన నిది కారణమాల,

2. ఉదా:-సుఖము పాడిపంటలవలన కలుగును. పాడిపంటలుకృషి వలన కలుగును. కృషి కష్టించి పనిచేసిన జరుగును. కావుననే కష్టే ఫలి అన్నారు పెద్దలు.

పై యుదాహరణమున ఉత్తరోత్తరమునకు పూర్వ పూర్వము కారణమైనది. కాన నిది కారణమాల.

38. సారాలంకారము :-

ఒక వస్తువుకంటె నొకవస్తువు గొప్పదని వర్ణించినచో దానిని సారాలంకార మందురు.

ఉదా :- రావణుఁడు మక్కిలి బలశాలి. అతనికంటె నతనిని చెఱఁ బెట్టిన కార్తవీర్యార్జునుఁడును, అతని కంటె నతనిని చంపిన పరశు రాముఁడును, అతని కంటె నతని నోడించిన రాముఁడును బలశాలురు.

పై యుదాహరణమున ఉత్తరోత్తరోత్కృష్టత వర్ణింపఁ బడినది. కాన నిది సారాలంకారము.

39. యథాసంఖ్యము (క్రమాలంకారము)

ఒక క్రమముగానున్న వానిని అట్టి క్రమములోనున్న యితరములతో సమన్వయ పఱచి వర్ణించేనచో దానిని యథాసంఖ్యమని గాని, క్రమాలంకారమని గాని యందురు.

ఉదా :- ఘోగాలము దాపురించినవాఁడు నీపనిర్వాణ గంధమును, అరుంధతిని, మిత్ర వాక్యమును మూర్కొనరు, కనరు, వినరు.

పై యుదాహరణమున మొదటి మూడు విషయములకును, తరువాత మూడు క్రియాపదములును సంఖ్యాక్రమమున అన్వయించుచున్నవి. కాన నిది యథాసంఖ్యాలంకారము.

40. సముచ్చయాలంకారము :–

ఒకే కాలమునందు అనేక కార్యములు జరుగునట్లు చెప్పినను, ఒకే కార్యము అనేక కారణములవలన జరిగినట్లు చెప్పినను దానిని సముచ్చయము అందురు.

1. ఉదా:- మేమాయడవిలో నడచుచుండ పొదలోని పాము బుస్సు మనెను. పెద్దపులి గాండ్రించెను. మేఘము గర్జించెను. వర్షము అధిక మయ్యెను.

2. ఉదా :- పడుచుదనము, భాగ్యము, ఉన్నతోద్యోగము' మూర్ఖత్వము అతని కన్నులు కప్పివేసినవి.

41. కావ్యార్థాపత్తి :–

కైముత్య న్యాయముచేత అర్థ సంసిద్ధి వర్ణించినచో దానిని కావ్యార్థాపత్తి యందురు.

ఉదా -హనుమంతుఁడు సూర్య మండలము పైకెగిరినాఁడు. అతనికి నూఱు యోజనముల సముద్రమును దాటుట ఏమి లెక్క-

కితము అనగా ఏమి చెప్పవలెను అని అర్థము. ఇది ఉపయోగించు చోటును క్రిముత్యన్యాయ మందు. ఒక గొప్ప పనిచేసిన వానికి అట్టి చిన్న పనిచేయుట యొక లెక్కలోనిది గదా! 'తలుపులు తినే బావ గారికి అప్పడములు ఒక లెక్క ? గుడిని మింగేవానికి గుళ్ళో లింగం ఒక లెక్కా ?" ఇట్టివి కైముత్యన్యాయములోనికి వచ్చును.

42. వికస్వరాలంకారము:-

ఒకే విశేషము వర్ణించి దానిని సామాన్యముతో సమర్థించి, యా సమర్థనముతో తృప్తిపడక మఱియొక విశేషమును ఉపమానముగనో, అర్థాంతరన్యాసముగనో చెప్పినచో దానిని వికస్వరాలంకార మందురు.

ఉదా:- లెక్కలేనన్ని రత్నములకు జన్మస్థానమైన హిమవత్పర్వతమునకు మంచు సౌందర్య హాని చేయఁజాలదు. చంద్రకిరణములతో కళంకమువలె గుణసమూహములో నొక దోషము కానరాదు.

43. ముద్రాలంకారము :-

"కృష్ణ! కృష్ణా! యటంచు నా కీరవాణి
రామా! రామా! యటంచు నారాజసుతుఁడు".

పై యుదాహరణము 'కృష్ణ, రామ' అను పదములు సుభద్ర యెడను, అర్జునుని యెడను ప్రకృతమున భగవత్ప్రార్థనగా నున్నను, కృష్ణ! అనఁగా ఓ అర్జునుడా! యనియు, రామ! అనఁగా, ఓ సుభద్రా యనియు సూచ్యార్థమును సూచించుచున్నవి. కాన నిది ముద్రాలంకారము.

44. ఉత్తరము :-

ప్రశ్నోత్తరములు రెండును ఒక్కటే వాక్యమైనచో దానిని ఉత్తరాలంకార మందురు.

ప్ర :- మామతోన వివాహము ?

ఉ :- మామ తోన వివాహము.

ప్రశ్నములోని మామతోన=అనునది ప్రశ్నార్థకము.

ఉత్తరములోని మామతోన=మామతోనే అని సమాధానము.

45. ఉదాత్తాలంకారము:-

సమృద్ధిగా వస్తు వర్ణనము జరిగినచో దానిని ఉదాత్తాలంకార మందురు.

1. ఉదా:- రత్న స్తంభముల యందుఁ బ్రవిష్టములైన ప్రతిబింబ సమాసములచే నావరింపఁ బడియున్న రావణుని హనుమంతుఁ డతికష్టముమీఁదఁ దెలిసికొనెను.

2. ఉదా:-ముంగాల సింగారముంగారమేలు బంగారు రంగరులంగా ధరించి డబ్బ కాయలఁ జూచి యబ్బగా రనిపించు గబ్బ గబ్బల కంచుకమ్ముఁ దొడిగి.

46 లోకోక్త్యలంకారము:-

లోకోక్తులను జెప్పినచో దానిని లోకోక్త్యలంకార మందురు.

ఉదా:- కంచు మోగినట్లు కనకంబు మ్రోగునా ?

47. వక్రోక్త్యలంకారము:-

శ్లేష సహాయముతో గాని, కాకు స్వర సహాయముతో గాని మఱి యొక యర్థమును స్ఫురింపఁజేసినచో దానిని వక్రోక్తి యందురు.

1. ఉ:- అతని నందఱును పుణ్యజనుఁ డందురు. రాక్షసుని వలె క్రూరుఁ డన్నమాట కాదు. పుణ్య కార్యములు చేయు జనుఁడు.

2. ఉదా:-నీవు మళ్ళీ వస్తావుగా !

అయ్యో ! ఎందుకురాను ? (రానని భావము)

48. ఛేకోక్త్యలంకారము:-

లోకోక్తి యర్థాంతరము గర్భితమై యున్నచో ఛేకోక్తి యగును.

ఉదా:-తాడితన్నెడు వానిఁ దల దన్నువాఁడును గలఁడు.

పై యుదాహరణములోననే అందరి కంటె గొప్పవాఁడని ఎవఁడును గర్వపడరాదు, అను నీతిని బోధించుచు నీ సామెత అర్థాంతర గర్భితమై యున్నది.

49. గూఢోక్త్యలంకారము:-

చుట్టుపట్ల వారికి తెలియరాకుండ ఏదేనిరహస్య విషయమితరులను సంబోధించి రహస్యముగాఁ జెప్పినచో దానిని గూఢోక్తి యందురు.

ఉదా:- చెలీ! రజని సమీపించుచున్నది త్వరగా రమ్ము.

పై యుదాహరణములో ప్రియునితో రహస్యముగాఁ జేరియున్న నాయికను చెలి "వృద్ధురాలు వచ్చుచున్నది. త్వరగా ఇవతలకు రమ్ము!" అని ప్రబోధింపఁ దలఁచి, వచ్చుచున్న వృద్ధురాలికి తెలియకుండ రాత్రి సమీపించుచున్నది. పోవుదము. త్వరగా రమ్ము అను సామాన్యముగా మాటాడుట జరిగినది. ఇందున్న గూఢాభిప్రాయము వేఱు, బహిరంగ మగా దోచునభిప్రాయము వేఱు. కాన నిది గూఢోక్తి యగుచున్నది.

50. వ్యాజోక్త్యలంకారము:-

మఱియొక కారాణమును జెప్పి ఆకారణమునందలి మార్పును కప్పి పుచ్చుకొనుట వ్యాజోక్తి యగును.

ఉదా:-చెలీ! కన్నుల నీరు పెట్టుకొనుచున్నా వెందుకు?
ఏమియులేదే ? పుప్పొడి కండ్లలో పడుటచే నీరు కమ్మినది.

పై యుదాహరణమున ఒక నాయిక తాను వలచిన ప్రియుఁడందు బాటు కామిచేఁ శోకించుచు, చెలి యది కనిపెట్టి ప్రశ్నింప, పుప్పొడి పడి కన్నులనుండి నీరు కారుచున్నదని తన యాకారములోని మార్పును ఇంకొక నెపముతోఁ దాచుటకు జూచుచున్నది. ఇది వ్యాజోక్తి.

# 9. రచనలో వచ్చు సామాన్య దోషములు

విద్యార్థులు వ్రాయునప్పుడు మామూలుగాఁ గొన్ని తప్పులు దొర్లు చుండును. ఇంచుక జాగరూకత వహించినచో వారి రచనలు నిర్దుష్టములు కాఁగలవు. వ్రాతను సరిదిద్దుకొనుటకు కొన్ని సదుపాయములు. ఈక్రింది తప్పొప్పులను జాగ్రత్తతోఁ దిలకింపుఁడు.

1. యకారంబును వువూవొవోలును దెలుఁగు మాటలకు మొదట లేవు. ఇచటఁ దెలుఁగుమాట లనఁగాఁ దెలుఁగు పదములని యర్థము.

| తప్పు | ఒప్పు | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| యెవడు | ఎవఁడు | వొకఁడు | ఒకఁడు |
| యెక్కడ | ఎకఁడు | యేడు | ఓడ |
| వుండు | ఉండు | వోర్పు | ఓర్పు |
| వూరు | ఊరు | వోదార్పు | ఓదార్పు |

2. సంధిస్థానమున ఉత్తరపదము మొదటనున్న హల్లును అచ్చుగా మార్చి వ్రాయరాదు.

| తప్పు | ఒప్పు | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| వారోచ్చినారు | వారు వచ్చినారు | వాడొచ్చినాఁడు | వాడువచ్చినాఁడు |

మీ రెళ్ళినారు మీరు వెళ్ళినారు ఎవడొచ్చినాఁడు ఎవఁడు వచ్చినాఁడు ఈఁడొచ్చినవారు ఈఁడు వచ్చినవారు ఒకడొచ్చినాడు ఒకడు వచ్చినాఁడు.

3. రేఫక్రింద రేఫము వచ్చినచో శకటరేఫమునే వ్రాయవలెను.

| తప్పు | ఒప్పు | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| మిర్రు | మిఱ్ఱు | గుర్రము | గుఱ్ఱము |
| కర్రు | కఱ్ఱు | బర్రె | బఱ్ఱె |
| కర్ర | కఱ్ఱ | జుర్రెను | జుఱ్ఱెను |

4. తెలుఁగు పదములలో ఋత్వమురాదు. తత్సమ పదములలో ఋత్వమా, ఉకారముతో కూడియున్న రేఫమా యని యాలోచించి వ్రాయవలెను.

| తప్పు | ఒప్పు | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| వెంటృకలు | వెంట్రుకలు | చంద్ృఁడు | చంద్రుఁడు |
| కృంకెను | క్రుంకెను | ధృవుఁడు | ధ్రువుఁడు |
| మిత్ృఁడు | మిత్రుఁడు | ద్రుష్టి | దృష్టి |
| దృతము | ద్రుతము | క్రుషి | కృషి |
| కౄరుఁడు | క్రూరుఁడు | క్రుశించు | కృశించు |
| గ్రుహము | గృహము | క్రుషీవలుఁడు | కృషీవలుఁడు |
| క్రుత్యము | కృత్యము | కృంగు | క్రుంగు |

5. శకట రేఫమును సంయుక్తాక్షరములో వ్రాయకూడదు.

| తప్పు | ఒప్పు | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| నేఱ్పు | నేర్పు | గుఱ్తు | గుర్తు |
| కూఱ్పు | కూర్పు | చేఱ్పు | చేర్పు |

6. శషస అను నక్షరములను ఒకదాని కొకటి వ్రాయరాదు.

| తప్పు | ఒప్పు | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| చేశితివి | చేసితివి | సివుఁడు | శివుఁడు |
| శీత | సీత | సిస్యుఁడు | శిష్యుఁడు |
| ప్రకాషము | ప్రకాశము | స్రేస్టము | శ్రేష్ఠము |

7. ఒత్తక్షరమును సరిగా వ్రాయవలయును.

| తప్పు | ఒప్పు | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| విధ్యార్థి | విద్యార్థి | సాదారణము | సాధారణము |
| విధ్య | విద్య | బోద | బోధ |
| బేధము | భేదము | బంగము | భంగము |
| సంభంధము | సంబంధము | చందస్సు | ఛందస్సు |

8. ఐత్వమునకును తావత్తునకును భేదము గుర్తించి వ్రాయవలెను.

| తప్పు | ఒప్పు | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| పైత్యము | పైత్యము | శైత్యము | శైత్యము |
| వస్తువు | వస్తువు | ఉత్తరము | ఉత్తరము |

| | | |
|---|---|---|
| సమస్థ ము | సమ స్తము | వైశంపాయనుడు వైశంపాయనుఁడు. |

9. ము ప్రత్యయమునకు బదులు సున్న రాయరాదు.

| తప్పు | ఒప్పు | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| సొంతం | సొతము | జ్ఞానం | జ్ఞానము |
| సాంతం | స్థాంతము | ఉదయం | ఉదయము. |

10 కళల మీద నకారమునుంచ కూడదు.

| తప్పు | ఒప్పు |
|---|---|
| రాకనుండు | రాకయుండు |
| పోకనుండు | పోకయుండు |

11. ద్రుత ప్రకృతికము పైన యడాగమము చేయకూడదు,

| తప్పు | ఒప్పు | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| వచ్చెను యతడు | వచ్చె నతడు | చేసెను యందురు | చేసెనందురు |
| నేను యెవడను | నేనెవడను | పోవుదును యంటిని | పోవుదునంటిని |

12. సంధి చేయవలసిన చోట్ల యడాగమము చేయఁ గూడదు.

| తప్పు | ఒప్పు |
|---|---|
| నన్నున్ యడిగె | నన్నడిగె |
| నాకొఅకన్ యిచ్చెను | నాకొఅకిచ్చెను, |

13. జ్ఞ కారమును 'గ' అని వ్రాయకూడదు.

| తప్పు | ఒప్పు | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| గ్నానము | జ్ఞానము | యగ్నము | యజ్ఞము |
| సంగ్న | సంజ్ఞ | ప్రగ్న | ప్రజ్ఞ |

14. చాల మున్నగు పదములను దీర్ఘాంతములనుగా వ్రాయరాదు.

| తప్పు | ఒప్పు | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| చాలా | చాల | అంతా | అంత |
| కూడా | కూడ | ఇంతా | ఇంత |

15. సముచ్చయార్థకమయిన నువర్ణమును ద్విత్వముగాను దీర్ఘాంతమున గాను వ్రాయకూడదు.

| తప్పు | ఒప్పు | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| నీవున్నూ | నీవును | అందఱమున్నూ | అందఱమును |
| నేనున్నూ | నేనును | ఒకఁడున్నూ | ఒకఁడును. |

16. ప్రార్థనార్థక ధాతురూపములను ఉత్వముతోనే వ్రాయవలెను. అత్వముతో వ్రాయకూడదు.

| తప్పు | ఒప్పు | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| వ్రాయమన్నాడు | వ్రాయుమన్నాఁడు | తినమన్నాడు | తినుమన్నాఁడు |
| చేయమన్నాడు | చేయుమన్నాఁడు | వెళ్ళమన్నాడు | వెళ్ళుమన్నాడు |

17. కొనుధాతు వను ప్రయుక్త మగునప్పుడు ధాతువు చివరనున్న 'యు' అను నక్షరము 'సి' గా మారును గాని, సుగా మారదు.

| తప్పు | ఒప్పు | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| చేసుకొను | చేసికొను | వ్రాసుకొను | వ్రాసికొను |
| పోసుకొను | పోసికొను | నేసుకొను | నేసికొను. |

18. క్త్వార్థమైన ఇకారమునకు సంధి చేయకూడదు.

| తప్పు | ఒప్పు | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| వచ్చిచ్చెను | వచ్చి యిచ్చెను | దాటేగెను | దాటి యేగెను |
| పోసిచ్చెను | పోసి యిచ్చెను | దాచడిగెను | దాచి యడిగెను. |

19. ఖఘ అను నక్షరములను థధ అను నక్షరములను సరిగా గుర్తించి వ్రాయవలెను.

| తప్పు | ఒప్పు | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| మేగము | మేఘము | గాధ | గాథ |
| రధము | రథము | బాథ | బాధ |
| సాథనము | సాధనము | శంఘము | శంఖము. |

20. ఔపవిభక్తికములు గల పదములను మామూలు పదములవలె వాడఁగూడదు.

| తప్పు | ఒప్పు | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| కన్నుతో | కంటితో | గోరుతో | గోటితో |
| పన్నుతో | పంటితో | నూయికి | నూతికి |
| ఏఱుకి | ఏటికి | నేయికి | నేతికి |

21. ఉదంత తద్ధర్మార్థ విశేషణములను ఏకారము చివర వచ్చునట్లు వాడరాదు.

| తప్పు | ఒప్పు | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| వచ్చేవాఁడు | వచ్చువాఁడు | తినేవాడు | తినువాఁడు |
| తెచ్చేవాడు | తెచ్చువాఁడు | చూచేవాడు | చూచువాఁడు |

22. గ్రామ్యపదముల నెన్నడును ప్రయోగింపఁ గూడదు.

| తప్పు | ఒప్పు | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| వస్తాడు | వచ్చును | చూస్తాడు | చూచును |
| తెస్తాడు | తెచ్చును | పోస్తాడు | పోయును |
| వెళ్ళాడు | వెళ్ళెను | వచ్చాడు | వచ్చెను, |
| | వెళ్ళినాఁడు | | వచ్చినాఁడు. |

23. పునరుక్తి వ్రాతయంతు దోషమగును.

| తప్పు | ఒప్పు |
|---|---|
| హిమాచల పర్వతము | హిమాచలము |
| సముద్ర పారావారము | సముద్రము, లేక పారావారము. |

24. తప్పు సమాసములను చేయకూడదు.

| తప్పు | ఒప్పు |
|---|---|
| అతి బండ | మిక్కిలి బండ |
| అతి వాగుడు | అతి యయిన వాగుడు. |

25. ఇట్లే మఱికొన్ని తప్పులు ఒప్పులు ఈ క్రింద చూపఁబడు చున్నది.

| తప్పు | ఒప్పు | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| అయిష్టము | అనిష్టము | బాలులు | బాలురు |
| నుంచి | నుండి | ప్రాధాన్యత | ప్రాధాన్యము |
| వాటిని | వానిని | | |
| అతను | అతఁడు | కృద్ధుడు | క్రుద్ధుఁడు |
| రుషి | ఋషి | మ్రుత్యువు | మృత్యువు |
| ఇవ్వవలెను | ఈయవలెను | వాత్సల్యము | వాత్సల్యము |
| హంశము | అంశము | బాల్యత్వము | బాల్యము. |

| తప్పు | ఒప్పు | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| సాయంత్రము | సాయంతనము | స్తానము | స్నానము |
| అప్రతిష్ఠ | అప్రతిష్ఠ | ఏంటి | ఏమి |
| ప్రస్థుతము | ప్రస్తుతము | కారనము | కారణము |
| స్తలము | స్థలము | ఫల్గుణుడు | ఫల్గునుఁడు |
| స్తానము | స్థానము | అర్జనుడు | అర్జునుఁడు. |

ఈ క్రింది వాక్యములలోని దోషములను సవరించి వ్రాయుము.

1. విధ్య పుస్తకంలో ఉంటే ఏం లాభము?
2. ఇంకా చాలా గొప్పవాణ్ణి ప్రపంచంలో ఉంటారని తెలుసుకో.
3. నేను సెప్పేమాట బాగా అర్థం చేసుకో.
4. ఈ వస్తువుని వాడు నిన్నే తెచ్చిచ్చాడు.
5. నిన్న నేను సెప్పిన కధ అంతా అప్పుడే మఱిచిపోయావా?
6. నన్న ప్రతిష్టపాలు జేయవాకు.
7. నిన్న బళ్ళో ఏం జరిగిందో తెలుసా.
8. ఓనాడు నేను యేట్లో పడవమీద ప్రయాణంచేస్తున్నాను. అంతట్లో పెద్ధ గాలొచ్చేసింది. పడవ ఆ గాలికి తట్టుకోలేక ఊగిసలాడడ మొదలెట్టింది. మా ప్రాణాలు ఎగిరిపోయినంత పనైంది.
9. నీ మాటలు నాకేమీ అర్థం కావడం లేదురా. నువ్వేందు కి అంటున్నావో నాకు తెలీదు. నిన్నటి మాటకీ ఈవాళ్ళిటి మా ఇంత వ్యత్యాసత్వం ఎందుకు వస్తోందో నేనూహించ లేకు ఉన్నారు.